శ్రీరస్తు.

# జాతీయసమష్టిధర్మతత్త్వరహస్యము



ఈ గ్రంథము

భీష్మబ్రహ్మచర్య నిత్యానంద యోగీశ్వర

పోకా వెంకటకృష్ణదాస

ప్రణీతంబై

పండిత పరిష్కారము పొంది





బెజవాడ:

ఆంధ్రగ్రంథాలయ ముద్రాలయం

క. కోదండరామయ్యగారిచే ముద్రింపబడినది.

1930.





[వెల రు 1—0—0.

ఓం శ్రీ గురుభ్యో నమః

# శ్రీ కృష్ణ స్తుతి.

క॥ శ్రీధవ కోమలవపుషా
బోధలు శృతులెల్ల నీవె ♦ పొందుగనైనన్
గాధలు సవరించియు నిట
నాధిక్యము సమరసంబు ♦ ననుపుము కృష్ణా! ౧

క॥ వేణువునూదుచు నాలో
జాణతనంబునను నీవు ♦ చరియించుము వి
న్నాణతనంబగు ద్వైతము
రాణించుచు ముద్దుగులుక ♦ రయమున కృష్ణా! ౨

క॥ రాధాలోలుడవట ధర
సాధుల హృదయాంతరాళ♦సాధ్యుడ వట నీ
బోధలు నాగమవిదులట
మాధవ! నను బ్రోవ నీవె ♦ మహిలో కృష్ణా! 3

క॥ బృందావనమున గోపీ
బృందంబులు గొలువ వేణు ♦ బూరించుచు గో
బృందంబుల మేపిన యా
నందం బిటు నాకు జూపు ♦ నయమున కృష్ణా! ౪

క॥ పార్థుని రథమును దోలుచు
సార్థకమగు గీతబోధ ♦ సలిపియు నిల స
త్యార్థము నిలిపిన శ్రీ గో
వర్ధనధర నన్ను బ్రోవు ♦ వరదుడ కృష్ణా! ౫

క॥ నీవే తల్లివి దండ్రివి
నీవే నాతోడు నీడ ♦ నిజముగ నన్నుం
బ్రోవను నీదే భారము
రావే శరణార్థి గావ ♦ రయమున గృష్ణా !

క॥ ఒడ్డారపు మాటలతో
బిడ్డల పెండ్లమును గోరి ♦ పెనుకామమునం
జెడ్డాడను తొలిజన్మల
మడ్డైత నిను గనగలేక ♦ మహిలో కృష్ణా !

క॥ తొలిబామున నే జేసిన
పలువిధముల పాపమేమొ ♦ పలుకవు నాతో
కలికాలం బనియా నే
మఱి నాత్మ్మక్ష ననియ నీదు ♦ మర్మము కృష్ణా !

క॥ వెన్నలదొంగా, రంగా,
వెన్నుడ, ననుగన్నవాడ, ♦ వ్రేతలఱేడా !
నిన్నెన్నడు జూతును నే
గన్నుల పండువును జెంద♦గా నిల గృష్ణా !

క॥ కోరితి నని కోపింపకు
కూరిమితో కొమరు డెపుడు ♦ కువలయమందుం
గోరుట మీరుట దూరుట
ధారుణి నైజంబు తల్లి♦దండ్రుల కృష్ణా ! ౧౦

శ్రీకృష్ణస్తుతి సమాప్తము.

---



శ్రీ శ్రీ బ్రహ్మచర్య నిత్యానంద యోగీశ్వర

ఫోటో వెంకటకృష్ణదాసు.

# విజ్ఞప్తి.



ఆర్యులారా! శ్రీమన్నారాయణుని కరుణాకటాక్ష వీక్షణాలంకారంబుచే నీదాసునకు ప్రజ్ఞానోత్పన్నంబై లోగడ ప్రమాదీచనామసంవత్సర వైశాఖశుద్ధ ఏకాదశిరోజున శ్రీ వైకుంఠుని ప్రచ్ఛన్నవేషదర్శనప్రాప్తి లభించి అంతనుండి క్రమేణా యీవిజ్ఞునికి వైరాగ్యోత్పత్తులు స్వానుభూతి అనురాగమును బొంది సంతరావూరి శ్రీలక్ష్మి చెన్నకేశ్వరస్వామి ఆలయమందు శ్రీ దిట్టకవి తిరుమలార్యులవారి అనుమతిని కొన్నివత్సరములు అచట గడిపి, తదుపరి తీర్థయాత్రాభిగమనంబున దేశాటనమొనర్చి, యనంతరము సద్గురుసాన్నిధ్యంబగు స్వస్థానంబు ప్రవేశించి,

ప్రథమ సత్కైంకర్యము

(1) శ్రీలక్ష్మి చెన్నకేశవ శతకమున్ను (2) శ్రీకృష్ణలీలలున్ను నాచే వ్రాయబడి తాడికొండ దొంతరాజు వెంకటప్పయ్య పంతులుగారిచే రూ. 150-0-0 లు బహుమతిగా నొసంగబడి యీ పైరెండు గ్రంథములున్ను ముద్రింపించి లోకప్రచారము గావింపించితిని.

ద్వితీయసత్కైంకర్యము.

బాపట్ల సమీపముననున్న కంకటపాలెమను గ్రామమునకు దైవికముగా నేను వెళ్ళగా ఆపుర రామభక్తస్వామి

జమువారు తమ గ్రామములో శ్రీ సీతారామాలయము స్థాపించుటకుగాను నన్ను ప్రోత్సహించిరి. అందుకుగాను నేను శ్రీ సీతారాముని ప్రార్థించి యీ కార్యనిర్వహణార్థమై కంకటపాలెమునందుచు తత్సమీపమున నున్న మురకొండపాడు అను గ్రామమునందును నివసించియున్న సర్వజనులకు భాగవతాది సద్గ్రంథములను కొలది దినములు వినిపించగా నా యభిప్రాయానుసారము వారందరకును శ్రీ సీతారామాలయము స్థాపించుకొనుటకు భక్తిశ్రద్ధలుగలిగి ఆ రెండు గ్రామములందుగల సర్వజనులవలన రు 20,000-0-0 (యిరువదివేలు) వసూలు కాబడి గ్రామనాయకుల సహాయమున కంకటపాలెంలో శ్రీ సీతారామాలయము స్థాపింపబడి, అందు శ్రీ స్వామివారి విగ్రహములను ప్రతిష్ఠించు సమయమందు,

1. పంగులూరి పిచ్చయ్య చౌదరిగారివల్ల రు2000-0-0 ల (రెండు వేల రూపాయలు) తో శ్రీప్రసన్నాంజనేయ దేవాలయమును అందు శ్రీ ఆంజనేయస్వామివారి విగ్రహప్రతిష్ఠయును జేయింపబడి అందు శ్రీస్వామివారి కైంకర్యముల నిమిత్తము (య 2 సెంట్లు 75) సేరి మాగాణిభూమి సమర్పింపబడెను.

2 అట్టి సమయముననే గొట్టిముక్కల అప్పన్న చౌదరీగారిచే రాతిజీవధ్వజము స్వయముగా వేయింపబడుచు శ్రీ సీతా

రాములవారి ప్రతిశుక్రవార, ఏకాదశి, ధనుర్మాసోత్సవములు శాశ్వత కైంకర్యముల నిమిత్తము బాపట్లచెరువులో నాల్గు (య 4) యెకరములు మాగాణిభూమి సమర్పింప బడియెను.

3 కారుమంచి బసవయ్య చౌదరీగారిచే రు 1300 లు ఖర్చులతో రాగితొడుపుతో సహా జీవధ్వజము వేయించ బడెను.

4 యార్లగడ్డ బుచ్చయ్యచౌదరీ గారిచే శ్రీ సీతా రాములవారి సాన్నిధ్యంబున నిత్యాఖండదీపారాధన నిమిత్తము యకరము మాగాణి సమర్పింపబడియెను.

5 నల్లమోతు సూర్యనారాయణ చౌదరీగారిచే శ్రీ స్వామివారికి ప్రతిసాయంత్రము శుండలు నివేదన శాశ్వతము గా జరుగునట్లుగా యకరముమాగాణి నివేదింపబడియెను.

6 అనంతరము కంకటపాలెం గ్రామవాస్తవ్యు లందరి సమ్మతమున గ్రామఘండువల్ల సంపాదింపబడిన (12 యకరము లు) మాగాణిభూమి శ్రీ సీతారామలక్ష్మణాంజనేయస్వాముల నిత్యనైవేద్య దీపారాధనల నిమిత్తము గ్రామవాస్తవ్యు లందరి సమ్మతమున సమర్పింపబడియెను. స్వామివారిప్రతిష్ఠాకాల మందుననే చిలకలూరిపేట సమీపమునునున్న సూరవరపు పల్లెవాస్తవ్యులగు బండారుపల్లె రాఘవయ్య చౌదరీగారిభార్య వెంకటసుబ్బమ్మ శ్రీ సీతారామలక్ష్మణులవక్షస్థల కవచము లకుగాను నూట రూపాయిలు వెండి సమర్పించిరి. ఇట్లే సర్వ

పాలించువారు లేనిచో ప్రయోజనము లేదని తలంచి కుమ్మరి కుండలు చేయుటకు భూమియందుండి మంటిని ముద్దజేసి చేసినట్లు పరమాత్మయు తన స్వసంకల్పమాత్రమున జలమునందుండియే యొకపురుషుని శిరఃపాణ్యాద్యవయవములతో పైకి నెత్తెను. అనగా ప్రధానముగా గల పంచభూతములనుండి అంభస్సు మొదలగు లోకముల నెట్లు సృజించెనో అట్లు వాటినుండియే పురుషుని నిర్మించెను.

శ్రుతి:—తమభ్యతపత్తస్యా .................(4)

తా॥ ఆపరమాత్మ పురుషాకృతియగు యీ పిండమును గూర్చి ఆలోచించెను. అందున పురుషాకృతియగు యీ పిండమునకు వాక్కు గలిగెను. ఆవాగింద్రియమున కధిష్ఠానదేవతయగు అగ్నిగలిగెను. పిమ్మట ముక్కులు గలిగెను. ముక్కులనుండి ప్రాణము గలిగెను. ఈ ఘ్రాణేంద్రియమునుండి దాని కధిష్టానదేవతయగు వాయువు గలిగెను. తరువాత నేత్రములు గలిగెను. నేత్రములనుండి నేత్రేంద్రియము గలిగెను. నేత్రేంద్రియమునుండి దాని కధిష్ఠానదేవతయగు సూర్యుడు గలిగెను. పిమ్మట శ్రోత్రములుగలిగెను. ఆశ్రోత్రములనుండి శ్రోత్రేంద్రియము గలిగెను. శ్రోత్రేంద్రియమునుండి దాని కధిష్ఠానదేవతలగు దిక్కులు గలిగెను. అనంతరము చర్మము గలిగెను. చర్మమునుండి రోమములుగలిగెను. రోమములనుండి దాని కధిష్ఠానములగు తరు గుల్మ లతాదులు గలిగెను. తరు

త్సరమునుండి సంతరావూరి శ్రీ స్వాములవారి యీ రెండు కైంక ర్యములును ఆపివేయబడినవి.

చతుర్థ సత్కైంకర్యము.

శ్రీ భగవదాజ్ఞానుసారము నాచే శ్రుతి స్మృతి పురాణేతిహాస ప్రతిపాదిత సిద్ధాంత యుక్తముగా స్త్రీలకు బాలుర కుకూడా మోక్షమార్గాధారము లగు ప్రవృత్తినివృత్తిధర్మ ములు సులభముగా తెలిసికొని, స్వానుభవమును పొంది యిహాపర సౌఖ్యము లనుభవించ నగునట్లుగా వ్రాయబడి యుం డుటగాను బాపట్ల తాలూకాలో గల

| | | |
|---|---|---|
| (1) | కొప్పర్తి గ్రామవాస్తవ్యులు | రూ. 116-0-0 |
| (2) | కంకటపాలెం వాస్తవ్యులు | 116-0-0 |
| (3) | డిటో గ్రామ గొట్టిముక్కలఅప్పన్నచౌదరిగారు | 116-0-0 |
| (4) | కారంచేడు భక్తసంఘమువారు | 100-0-0 |
| (5) | జమ్ములపాలెం వాస్తవ్యులు | 50-0-0 |
| (6) | నర్సాయపాలెం గ్రామవాస్తవ్యులు | 50-0-0 |
| (7) | కుంకలమర్తి గ్రామవాస్తవ్యులు | 50-0-0 |
| (8) | తాడికొండ గ్రాII వెంకటప్పయ్యగారి భార్య అన్నపూర్ణమ్మగారు | 25-0-0 |

ఇట్లు బహుమతులొసంగబడి సర్వమతసారమను మోక్షమార్గమను గ్రంథము రు 700-0-0 లతో అచ్చు వేయించి లోకప్రచారము చేయగల్గితిని. కాని యీగ్రంథము

నందు ద్వితీయ ముద్రణకొరకు తృతీయాధ్యాయము పూర్చి
సర్వజనసర్వమతాదరణీయ వేదానుసంధానముగా సర్వు
లకు దెలియునట్లు గృహస్థధర్మములు నిరూపించుటయున్ను,
6 వ అధ్యాయమున శివపంచాక్షరీ నారాయణ అష్టాక్షరీ
శ్రీరామతారకములను మంత్రమంత్రార్థన్యాసఅంగము
లతో సహా వ్రాసియుండుటయు అందలి స్నానవిధి సంకల్పవిధి
కేశవనామములతో సహా సర్వులు చూచినంతనే సులభ
ముగా గ్రహించులాగున వ్రాసియుండుటయును, 11 వ
అధ్యాయమున పంచీకరణవిభాగ లయంబులను స్త్రీలకు
బాలురకున్కూడా తెలియునట్లు వ్రాసియుంటయు, 12 వ
అధ్యాయమున మహావాక్యార్థానుభవము సులభశైలిని వ్రాసి
యుంటిని. కాని ప్రస్తుతము యీ సర్వమతసారము మోక్ష
మార్గమను గ్రంథము ద్వితీయముద్రణ వేయించుటకుగాను
రు 1200 రూపాయలు కావలసి వచ్చినందున ప్రస్తు
తము నిలిచియున్నది. దీనికిగాను యే లక్ష్మీసంపన్నులైన
పుణ్యాత్ములగు స్త్రీ పురుషులు ద్రవ్యసహాయ లగుదురో
తెలియకున్నది.

పంచమ స్వత్కైంకర్యము.

ఇప్పుడు యీ జాతీయసమష్టిధర్మతత్త్వరహస్య మను
గ్రంథమును సమష్టితత్త్వానుభవప్రాజ్ఞాభిలాషులగు అనేక
మంది పురుషులు నన్ను వ్రాయుమనిగోరగా సర్వశాస్త్రాను

సారమై హిందూమత సమష్టి తత్త్వరహస్యోపదేశమును వెల్లడించునట్టి యీ గ్రంథము భగవదనుగ్రహమువలన నా చే వ్రాయబడి, యిది ముద్రింపించుటకుగాను-

| | రు. అ. పై. |
|---|---|
| (1) గన్నవరంతాలూకా, తేలప్రోలు వాస్తవ్యలగు తియ్యగూర నారాయణరెడ్డిగారు. | 100-0-0 |
| (2) వంగవోలుతాలూకా, ముప్పవరం గ్రామ వాస్తవ్యలు గనిమిడి సుబ్బయ్యగారి భార్య అచ్చమ్మయును. | 100-0-0 |
| (3) డిటో గ్రామవాస్తవ్యరాలు, పెంటాల సురతానమ్మయును. | 25-0-0 |
| (4) బాపట్లతాలూకా కారంచేడు వాస్తవ్యులగు ఘంటా కొండయ్యగారు. | 50-0-0 |
| (5) డిటో తాలూకా ఉప్పలపాడు గ్రామవాస్తవ్యలు పెంటాల బలరామయ్య. | 50-0-0 |

యిట్లే మానసత్యాశ్రమపీఠసాధుసమాజవేశకు లగు కొందరి పుణ్యాత్ములచే రు 1500-0-0 రూపాయిలు వసూలు కాబడి యీ గ్రంథముద్రణకు రు 500 లు ఖర్చుపెట్టి ముద్రింపించితిని. మిగిలిన ద్రవ్యము

## షష్ఠసత్ప్రకరణము.

మాభక్తసంఘ సభ్యులవలన కోరబడి చీరాల రైలు
స్టేషను వద్ద సత్యాశ్రమపీఠము స్థాపించి అందు గురుపరం
పర పీఠాధిపత్యము నొకరిచే వహింపబడుచు సత్యసమష్టిధర్మ
తత్వరహస్యమును సదా సర్వులకు బోధించుచుండులాగున
జరుపుటకు యత్నించి అందులకుగాను రు 600-0-0 లు
ఖరీదుతో నొక స్తలమును కొంటిమి. కనుక యికమీద శ్రీ
భగవంతుని కృపాకటాక్ష సద్గురుప్రసా దాశీర్వాదముచే
క్రమేణ సత్యాశ్రమపీఠస్థాపనచేసి అంతనుండి సర్వత్రా
వ్యాపించి సర్వశాస్త్ర మంత్రయోగతత్వరహస్యములను
సర్వులకును బోధచేతను మాసపత్రికవ్యాసములచేతను
ప్రచురింపబడ వలయునని యీ సత్యసంఘమువారి అభి
ప్రాయము గలదు. గనుక ఇకమీద నాచే యే చందాలు
వసూలు చేయబడినను సత్యాశ్రమపీఠమందుగల సద్విషయ
ములకే వినియోగింప బడుచుండును. గాన, ఇదివరలో మాచం
దా పత్రికలయందు చేరియున్న సత్యసంఘమువారలందరును
నెరుంగునది.

ఆర్యులారా! ఈగ్రంథమందు శృతిస్మృతులుదాహరించుచో
టలో శ్లోకములు మాత్రము గ్రంథవిస్తరము గాకుండులాగున
సూచించి తాత్పర్యమును మాత్రము సాంగముగ వ్రాసినాడ
నను సందేహమున్నవారలు ఆ యా గ్రంథములు తెప్పించి
చదువుకొనుడు.

ఈ గ్రంథము ప్రతియొకరును సాంగముగా చదివిననేగాని సర్వవిషయములు బోధపడి సమష్టి రహస్యార్థము స్వానుభవమునకు రాజాలదుగనుక చదువరులు శ్రద్ధతో దీనిని రెండు మూడు పర్యాయము లైనను పఠించి స్వానుభవము పొందగలంగులకు విజ్ఞప్తి.

బ్రహ్మ క్షత్రియ వైశ్య లను త్రైవర్ణములవారికిని నొక విజ్ఞాపన కలదు. ఈలోకములో ప్రజలకెప్పుడు కుల మతవ్యష్టివైషమ్యములు శాశ్వతముగగలవు. అందువలన యీ గ్రంథము సమష్టి తెలియ జేయుటవలన యీగ్రంథకర్త బ్రాహ్మణ ద్వేషి యని మీరు తలంచవచ్చును గాని నాయభిప్రాయ మది గాదు. ఎందువల్లననగా నే నిదివరలో సర్వమత సారము మోక్షమార్గమను గ్రంథమున మతసమష్టి వ్రాసియున్నాడను.

ఇప్పుడట్లే నివృత్తిమార్గమగు జ్ఞానస్థానమందు జాతి సమష్టి వ్రాసియున్నాడను. ఎందువల్లననగా సర్వులకును, జ్ఞాన మార్గములో శరీర భ్రాంతి వదలి, సమష్టిధర్మతత్వము తెలిసికొని ఆత్మధర్మము సర్వభూతదయతో నడచిననేగాని మానవునకు మోక్షప్రాప్తి లభించదుగనుక సర్వ వేదసారంబైన భగవద్గీత ననుసరించి సర్వశాస్త్రసారము సమష్టి సర్వులకు తెలియగలందులకై యీగ్రంథమున వేదరహస్యము తెలియు జేయుడ మైనదిగాని, ప్రవృత్తివైషమ్యముగ వ్రాసినదికా దని పండిత వర్యులు గ్రహించ ప్రార్థింతును.

అయినను, నేను విశేషించి వ్రాయనేల,

"వినదగు నెవ్వరు జెప్పిన। వినినంతన వేగపడక వివరింపదగున్ ।
కని కల్లనిజము దెలిసిన। మనుజుడెపో నీతిపరుడు మహిలో..."

అనున్యాయంబున యీ గ్రంథము నిదానించి ఆత్మదృష్టితో సమన్వయించు ఆత్మజ్ఞులకు ఇది శాస్త్రాంతర్భూతమా, లేక వ్యష్టి స్వకపోల కల్పనయా అను ధర్మము విశదము కాగలదు. శాశ్వతసౌఖ్యమును బడయగోరు విజ్ఞులు నిదానించి యోచించుకొనగలందులకు విజ్ఞప్తి.

ఇందుగల ఛందో వ్యాకరణ సందిగ్ధ ముద్రణాదిలోపములను ద్వితీయముద్రణములో సవరింతును. ఇంకేవి శేషములున్న యెడల యెవరు తెలియపరచినను ద్వితీయముద్రణాలో నీగ్రంథమందు చేర్తును.

నాకు తల్లిదండ్రులచే నొసంగబడినది వెంకటకృష్ణయ్య అనియు సద్గురువుచే నొసగబడినది 'దాస' శబ్దమును ఉపన్యాస సభలలో బుధులచే నొసంగబడినది "భీష్మబ్రహ్మచర్య నిత్యానందయోగీశ్వర" నామకరణ మని చదువరులు గ్రహించునది.

ఇట్లు బుధజనవిధేయుడు,
భీష్మబ్రహ్మచర్య నిత్యానందయోగీశ్వర
పోకా వేంకటకృష్ణదాసు,
బాపట్లతాలూకా, సంతరావూరు.

---

# విషయసూచిక.







ఓం

శ్రీ గురుభ్యో నమః

# జాతీయసమష్టిధర్మతత్త్వరహస్యము

ప్రథమాశ్వాసము.

— ప్రథమభాగము. —

## ఋగ్వేదజగత్సృష్టిక్రమవిచారణ.

### ప్రపంచోత్పత్తిక్రమము.

సుజనులారా! ఆదియందు శ్రీభగవంతునివలన జగత్సృష్టిగలిగిన విషయమునుగురించి హిందూమతమునకు ప్రథమవేదంబైన ఋగ్వేదముయొక్క 11 వ అధ్యాయమునందును, నాలుగవ వేదంబైన అధర్వణవేదంబుయొక్క 2వ అధ్యాయమునందును, 3వ విచారణ భాగవత, బ్రహ్మాండ పురాణములచేతనున్న భేదభేదములుగా సృష్టిక్రమవిచారణ తెలియవచ్చుచున్నయది. అందు యీ త్రివిధజగత్సృష్టి విధానమును గురించి యీ గ్రంథముయొక్క తృతీయాధ్యాయాంతములోపల సక్రమముగా వ్రాయబడును. విజ్ఞులు వివాదములేక గ్రహించునది. ఇక ప్రశ్నోపనిషదాదినాగల మఱికొన్ని గ్రంథములయందు కథాసందర్భానుసారముగా

జగత్సృష్టివిచారణను గురించి వ్రాసియున్నది. అయినను యీపైన చూపించినటువంటి ఋగ్వేదాది త్రివిధప్రమాణములననుసరించి యేవాక్యభేదమైనప్పటికిని అనుభవరహస్యార్థము ఒకటిగనే వచించబడియుండును. కనుక చదువరులు సక్రమముగా గ్రహించునది.

ఇందు ప్రథమవిచారణ ఋగ్వేదము.

తదంతర్గతమైన ఐతరేయోపనిషత్తు ప్రామాణ్యమిచ్చుచు యీ గ్రంథమున వ్రాయబడుచున్నది. గ్రహించునది.

శ్రుతి:—హరిః ఓమ్, ఆత్మావా ఇదమేక ఏవాగ్రఆసీత్, నాన్యత్కించనమిషత్, స ఈక్షతలోకాన్నుసృజాఇతి.

—ఐతరేయోపనిషత్ 1 అ. 1 ఖణ్డము.

తా॥ ఈ ప్రపంచము సృష్టికిపూర్వము పరమాత్మ అద్వితీయుడై సర్వజ్ఞుడై సర్వశక్తిగలవాడై క్షుత్పిపాసాది సకలసంసారధర్మములు లేనివాడై, నిత్యుడై, పరిశుద్ధుడై, బుద్ధుడై, ముక్తుడై, జన్మములేనివాడై, వార్ధక్యములేనివాడై, మరణములేనివాడై, కేవల మాత్మమాత్రుడై యుండెను. ఇట్టి పరమాత్మ లోకములను, లోకపాలకులను సృష్టింపదలంచెను.

శ్రుతి:—స ఇమాంల్లోకానసృజత అమ్భో మరీచీర్మరమాపో ఽదోఽమ్భః పరేణ దివంద్యౌః ప్రతిష్ఠాఽన్తరిక్షం మరీచయః, పృథివీమరోయా, అధస్తాత్తా ఆపః.(2)

తా॥ ఆ పరమాత్మయే యీ లోకములను సృజించెను. (ఎట్లనగా ఇంద్రజాలకుడు తనను తానే స్వశక్తిచే ఆకాశమునందు నడచువానినిగా నియమించుకొనినట్లు). స్వశక్తియుక్తుడగు పరమాత్మ ప్రపంచమును సృజించెను. ప్రథమమున అంభస్సు మొదలగు లోకములను సృజించె నని శ్రుతియందే చెప్పబడియున్నది. అంభస్సులోకము ద్యులోకమున కావల నున్నది. ఈ లోకము వర్షించు జలమును భరించునదిగనుక అంభస్సులోక మని పేరుగలిగెను. ఈ లోకమునకు ద్యులోక మాధారముగా నున్నది. ద్యులోకమునకు దిగువ అంతరిక్షలోకము అనగా సూర్యమండలలోకము ద్యులోకమున కాధారముగ నున్నది. ఈలోకమునకు దిగువ భూలోక మాధారముగా నున్నది. ఈ భూలోకము సర్వభూతములయొక్క జనన మరణాదులకు స్థానభూతముగా నున్నది. దీనికి దిగువ అప్పులు అనగా జలమయమైన లోకము భూలోకమున కాధారముగ నున్నది. ఈవిధముగా పరమాత్మ ప్రాణులెల్లరును కర్మఫలము లనుభవించుకొరకు అంభస్సు, మరీచి, భూమి, అప్పు, అను నాలుగులోకములను క్రమముగా నొకదానికింద నొకటి సృజించెను.

శ్రుతి॥ స ఈక్షతేమేనులోకాలోకపాలాన్నుసృజా ఇతి,
సో ద్భ్య ఏవ పురుషం సముద్ధృత్యామూర్ఛయత్. (3).

తా॥ ఆపరమాత్మ నాచే సృజింపబడు లోకములను

పాలించువారు లేనిచో ప్రయోజనము లేదని తలంచి కుమ్మరి కుండలు చేయుటకు భూమియందుండి మంటిని ముద్దజేసి పోత్తు నట్లు పరమాత్మయు తన స్వసంకల్పమాత్రమున జలమునం దుండియే యొకపురుషుని శిరఃపాణ్యాద్యవయవములతో పైకి నెత్తెను. అనగా ప్రధానముగా గల పంచభూతములనుండి అంభస్సు మొదలగు లోకముల నెట్లు సృజించెనో అట్లు వాటి నుండియే పురుషుని నిర్మించెను.

శ్రుతి:—తమభ్యతపత్తస్య..................(4)

తా॥ ఆపరమాత్మ పురుషాకృతియగు యీ పిండమును గూర్చి ఆలోచించెను. అందున పురుషాకృతియగు యీ పిండ మునకు వాక్కు గలిగెను. ఆవాగింద్రియమున కధిష్ఠానదేవత యగు అగ్నిగలిగెను. పిమ్మట ముక్కులు గలిగెను. ముక్కుల నుండి ప్రాణము గలిగెను. ఈ ఘ్రాణేంద్రియమునుండి దాని కధిష్టానదేవతయగు వాయువు గలిగెను. తరువాత నేత్రములు గలిగెను. నేత్రములనుండి నేత్రేంద్రియము గలిగెను. నేత్రేంద్రియమునుండి దాని కధిష్ఠానదేవతయగు సూర్యుడు గలిగెను. పిమ్మట శ్రోత్రములుగలిగెను. ఆశ్రోత్రములనుండి శ్రోత్రేంద్రియము గలిగెను. శ్రోత్రేంద్రియమునుండి దాని కధిష్ఠానదేవతలగు దిక్కులు గలిగెను. అనంతరము చర్మము గలిగెను. చర్మమునుండి రోమములుగలిగెను. రోమములనుండి దాని కధిష్ఠానములగు తరుగుల్మలతాదులు గలిగెను. తరు

వాత అంతఃకరణాధిష్ఠానమగు హృదయముగలిగెను. హృద
యమునుండి మనస్సుగలిగెను. మనస్సునుండి దాని కధిష్ఠాన
మగు చంద్రుడు గలిగెను. పదంపడి సకలవాయుబంధనస్థాన
మైన నాభి గలిగెను. నాభినుండి అపానవాయువుతో గూడిన
పాయ్వింద్రియము గలిగెను. పాయ్వింద్రియమునుండి దాని
కధిష్ఠానమగు మృత్యువు గలిగెను. ఆమీద గుహ్యేంద్రి
యము గలిగెను. గుహ్యేంద్రియమునుండి శుక్లము గలిగెను.
ఆశుక్లమునుండి దాని కధిష్ఠానములగు జలమును (ప్రజాప
తియు)ను గలిగెను. ఇట్లు పరమాత్మ విరాట్స్వరూపమైన
ప్రథమపురుషునకు అవయవాద్యవయవములును వాటి కధి
దేవతలును సంపూర్ణముగా (పంచీకరణ ప్రకారము) సృజి
యించెను.

శ్రుతి:—తా ఏతా దేవతాః సృష్టా ......ద్వితీయఖణ్డ (1)

తా॥ పరమాత్మచే లోకపాలన కొరకు విరాట్స్వరూ
పునినుండి సృజింపబడిన సూర్యచంద్రాగ్న్యాదికాది దేవతలు
అజ్ఞానము, కామము, కర్మము, జన్మము, దుఃఖము అనున
వియే జలముగా గలిగినదియు, క్రూరములగు రోగములచే
మొసళ్లుగా గలిగినదియు, ఆద్యంతములు లేనిదియు,
సత్యము, ఆర్జవము, దానము, దయ, అహింస, దమము, శమ
ము, ధృతి, నీ మొదలగు ఆత్మగుణములైనను పాథేయము
(అనగా మార్గమందలి భోజనము) చే నిండింపబడిన జ్ఞాన

మను తెప్పగలిగినదియు, మోక్షమే తీరముగా గలిగినదియు నగు నీ సంసార మను మహాసముద్రములోబడిరి. అనంతర మా పరమాత్మ విరాట్పురుషునకు ఆకలిదప్పులు గలుగజేసెను. ఆపురుషునకు గలిగినందువలన ఆతనియందు నివసించియుండు అగ్న్యాదిదేవతలందరును ఆకలిదప్పులచే పీడింపబడిన వారై పరమాత్మను గురించి యిట్లు స్తుతించిరి. 'జగన్నియంత వగు భగవంతుడా! మేము యెచ్చట నివసించి యీ ఆకలిదప్పులు దీర్చుకొనవలయునో మా కాయధిష్ఠానమును జూపించు' మని ప్రార్థించిరి.

శ్రుతి:—తాభ్యో గామానయత్తా అబ్రువన్నవై.....(2)

తా॥ ఇట్లు అడిగిన దేవతలకొరకు ఆ పరమేశ్వరుడు పూర్వమువలెనే ఆయుదకములనుండియే, యొకపిండము నెత్తి గోవుగా నిర్మించి దేవతల కగపరచెను. ఇది మాకు సమర్థమైనది కాదనిరి. పిమ్మట ఆ భగవంతుడు గుఱ్ఱమును నిర్మించి యాదేవతల కగపరచెను. ఇదియును మాకు సమర్థమైనదికాదనిరి. (అనగా యీ గోవు, అశ్వములను నిర్మించి యీదేవతలకు జూపించి మీ రీగోవులోగాని గుఱ్ఱములోగాని ముందు విరాట్పురుషునినుండి మీ రేయే యవయవముల నుండి జనించితిరో అట్లే యీగోవుయొక్క నేత్రములసూర్యుడును, మనస్సున చంద్రుడును ఇట్లే ఆయా యింద్రియముల యందు ఆయా అధిష్ఠానదేవతలుగా ప్రవేశించి నివసించి గోవు

నందుగాని, అశ్వమునందుగాని జీవించుడని శ్రీభగవంతుడు సెప్పగా దేవతలు 'మాకు యీగోవు అశ్వము అధిష్ఠానస్థానమునకు చాల'వనిరి. అందువలన సురల పరమాత్మ)—

శ్రుతి:-తాభ్యః పురుషమానయత్తా అబ్రువన్ సుకృతం బతేతి పురుషోవావసుకృతమ్, తా అబ్రవీద్యథాయతనం ప్రవిశతేతి(3)

తా॥ పిమ్మట పూర్వమువలెనే ఆ యుదకములనుండి ఒక పురుషుని నిర్మించి దేవతలకు చూపించగా వారు సంతసించి యీ మనుష్యాకారము సుకృతమైనది. మంచిదే, ఇందు ప్రవేశించెదమనిరి. (అట్లు పరమాత్మఆజ్ఞప్రకారము ముందు కనబరచునట్టి పంచీకరణచక్రమునందు ఏయే యింద్రియమునకు ఏయే అధిదేవత చూపింపబడునో అదేప్రకారము).

శ్రుతి:—అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశ ద్వాయుః..(4)

తా॥ ఇట్టిమానవుని యొక్క శరీరమునందు సర్వావయవములలో అగ్న్యాదిదేవతలందరు పరమాత్మయాజ్ఞను బొంది, రాజాజ్ఞను బొందిన సేనాధిపతులు పట్టణంబున ప్రవేశించినట్లు, యీమానవదేహమున దేవతలందరు ప్రవేశించిరి. ఎట్లనగా వాక్కునందు అగ్నిహోత్రుడును నాసికమునందు ప్రాణమును నేత్రములయందు సూర్యుడును శ్రోత్రములయందు దిగధిదేవతలును మనస్సున చంద్రుడును చర్మము

నందు వృక్షములగు రోమములును అపానమున మృత్యువును గుహ్యమున జలంబును ఇట్లే ప్రవేశించిరి.

శ్రుతి:—త మశనాపిపాసే అబ్రూతా......(5)

తా॥ ఇట్లా దేవతలుమనుష్యశరీరమును బొందిన వెంటనే క్షుత్పిపాసలు భగవంతునిగురించి మేము ప్రవేశించుటకు స్థానము జూపించుమని యడిగిరి. అంతట శ్రీ భగవంతుడు ఓక్షుత్పిపాసలారా! మీరు ఏదేని చేతనపదార్థమును అనగా మనుష్యాది భూతములయందు ప్రవేశించినగాని మీరు భుజించుటకు వలనుపడదు. కనుక మీరు అధ్యాత్మదేవతలైన యీ యింద్రాదిదేవతలందు ప్రవేశించుడు. మీకు జీవనము విభాగించి యిచ్చెద, ననెను. అట్లు సృష్ట్యాదియందు భగవంతుడు ఆయా దేవతలకుఆహారవిభాగములు చెప్పినందువలననే యిప్పుడు మనము ఏయేదేవతనుగురించి ఆరాధింతుమో ఆ యా చరు, పురోడాశనాదులు ఆయాదేవతలకే చెందుచున్నవి. (అధ్యాత్మదేవత లనగా వ్యష్టిస్వరూపమగు మానవదేహమందుండు దేవతలు, అధిదేవత లనగా సమష్టిస్వరూపులైన విరాట్టుదేహమందుండు దేవత లని యెఱుంగునది.) అంతమరల శ్రీజగన్నియంతయగు పరమాత్మ యిట్లు తలంచెను.

శ్రుతి:— సాఈక్ష తేమేనులోకాశ్చలోకపాలాశ్చాన్న మే భ్యఃసృజాఇతి (తృతీయఖణ్డము) (1)

తా॥ నాచే లోకములును లోకపాలకులును సృజింపబడిరి. ఆఅగ్న్యాదిదేవతలకు ఆహారములేనిచో స్థితిగలుగదు. కాబట్టి నేను వారికొరకు అన్నమును సృజించెద నని ఆలోచించెను.

శ్రుతి:—సోఽపోఽభ్యతపత్ తాభ్యోఽభితప్తాభ్యోమూర్తి
రజాయత, యా వైసామూర్తి రజాయతాన్నం
వై తత్ (2)

తా॥ ఆజగదీశ్వరుడు అన్నమును సృజింప దలచినవాడై మును జెప్పబడిన జలమునుండి మిక్కిలి కఠినమై శరీరపోషణోపయోగమై స్థావరజంగమాత్మక మగు నొకమూర్తిని గలిగించెను. అదియే అన్నమైనది.

శ్రుతి:—తదేనత్సృష్టం...(3),(4),(5),(6),(7),(8),(9),(10)

తా:—ఇట్లు సృజింపబడిన యన్నమును మునుసృజించిన దేవతల కభిముఖముగా నుంచగా ఆయన్నము ఆలోకపాలకులనుజూచి వీరు నాకు మృత్యువు లని తలచి పారిపోవుట కుపక్రమించెను. అంత మొదటపుట్టిన విరాట్పురుషుడు ఆయన్నమును వాక్కుతో న్వాహృతి బొందగోరెను. కాని అట్లు గ్రహించుటకు వీలు కాకపోయెను. అట్లే నాసికముతో నాఘ్రాణించియు, శ్రోత్రములచేత, నేత్రములచేత, ఇట్లే సర్వేంద్రియములచేత స్పర్శముచే గ్రహించుటకు ప్రయత్నించెను. కాని వీలుగాకపోయెను. అనంతర మా విరాట్పురుషుడు

ఆయన్నమును అపానవాయువుచే ముఖద్వారము మూలముగా గ్రహించి భుజించెను. అందువలననే ఇప్పుడు సకలజీవులును ఆహారమును ముఖద్వారముననే భుజించుట గలిగెను.

శ్రుతి:—సాఈక్షతకథం, ............(11)

తా॥ ఆపరమాత్మ యిట్లు లోకములను లోకపాలకులను సృష్టించి వారి కాహారమును గలుగజేసినపిమ్మట, పట్టణమునకు రక్షకు లెట్లో అట్లే శరీరమను పట్టణమునకు రక్షకులగు, అగ్న్యాదిదేవతలను యీ శరీరమందు ప్రవేశింపంజేసి తాను లేనియెడల యీపిండ మెట్లుజీవించుననితలంచి నేనీపట్టణమునకు రాజువలె అనగా రాజు వేరై సేవకులు మొదలైనవారు సేయునట్టి స్తోత్రసేవకావృత్తులకు సాక్షియై యుండునట్లు నేనీ శరీరమందు దేహేంద్రియాదిసకలవ్యాపారములకును ఆయా దేవతలకును కర్తనగు సాక్షినై భోక్తనై యుండెదనని నిశ్చయించి నేనీశరీరములో యేమార్గమున ప్రవేశింపనగును యీ వాగాదీంద్రియములు చేయుచుండు వ్యాపారముల నన్నిటిని ప్రత్యేకప్రత్యేకముగా ఇది, ఇది యని విభజించి తెలిసికొనెడి నేను యెవడను అని విచారించెను.

శ్రుతి:—సా ఏతమేవ సీమానం......... (12)

తా॥ ఆపరమాత్మ యీ శరీరములో ప్రవేశించుటకు యిట్లు యోచించెను. నాకార్యము లన్నిటిని నెరవేర్చుటకు నాసేవకుండైన ప్రాణము ప్రవేశించు మార్గములు రెండింటిలో

నేను శిరోగ్రభాగమున అనగా బ్రహ్మరంధ్రమును భేదించుకొని ప్రవేశింతునుగాక యని నిశ్చయించి కపాలమును చీల్చుకొని ప్రవేశించెను. ఇట్లు యీ మార్గద్వారముగా జొచ్చి బ్రహ్మానందము ననుభవించుటంబట్టి ఆస్థానము నానంద మనంబడెను. ఇట్లు ప్రవేశించిన జీవాత్మకు యీ శరీరమందు క్రీడాస్థానములు మూడుగలవు. (1) జాగ్రతకాలమందు కుడికన్నును (2) స్వప్నకాలమందు మనస్సును (3) సుషుప్తికాలమందు హృదయాకాశము అనునవి స్థానములు.

శ్రుతి:—సజాతోభూతా............ (13)

తా॥ ఆపరమాత్మ ఆశరీరమందు జీవాత్మగా ప్రవేశించి జననమరణాదులచే వ్యష్టిభావనతో సంకటమొందితుదకు కొన్నిజన్మములకు ఒక్కొక్క శరీరమునందున్న ప్రత్యగాత్మ గురుప్రజ్ఞానబోధితస్సు తన నిజస్వరూపమును తెలిసికొనిస్వప్నమువంటి యీప్రపంచమునందుగల భూతకోటిని జూచి నేను యివన్నియు బ్రహ్మమునకంటె భిన్నమైనవని చెప్పదునాయేమి? అని ఆలోచించి బ్రహ్మమునకంటె భిన్నమైన దేదియును లేదని నిశ్చయించును. (ఇట్లే సర్వభూతకోటిశరీరములును "క్షేత్రజ్ఞంచాపి మాంవిద్ధి, సర్వక్షేత్రేషు భారత" అనగా అర్జునా! యీ సర్వభూతకోటిశరీరములో నేను నివసించియుండుటకు పురంబులు అని శ్రీకృష్ణపరమాత్మ ఆనతిచ్చినటుల యెల్ల యిండ్లలోగల దీపము లన్నియు ఒక్కఅగ్నిస్వరూపమే అయి

ఒకదాని కొకటి భేదము లేనట్లు యీసర్వభూతకోటి యనెడు శరీరము లనే పురంబులలో గల ఆత్మస్వరూప మొక్కటియే, కరచరణాద్యవయవములు పంచభూత విభాగము నొక్కటియే, ఆ యా స్థానాధిష్ఠాతలగు దేవతాస్వరూపము లొక్కటియే, గనుక మానవులందుజాత్యాదిభేద భావన లేదని వేదసమ్మతము.

ఋగ్వేదీయ ఐతరేయోపనిషత్.

ద్వితీయోఽధ్యాయః-అథప్రథమః ఖణ్డః.

శ్రుతి॥ ఓం పురుషేహవా............(1)

తా॥ ఈ జీవుడు అజ్ఞానమును కామ్యకర్మాభిమానద్యనమును గలవాడై యజ్ఞయాగాది సుకర్మల కొన్నిటి నాచరించి ధూమాదిమార్గముగా చంద్రుని బొంది అచట పుణ్యము తీరగానే "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి" అనగా స్వర్గాదిలోకములకు పోయినవారు పుణ్యము తీరిపోగానే మరల యీ మర్త్యలోకమున బుట్టుదు రను గీతావాక్యానుసరణి యీ జీవుడు అన్యలోకము నుండి వర్షము మొదలగువాని ద్వారముగా ధాన్యాదులందు జేరి అన్నమై పురుషాగ్నియందు హోమముచేయబడి రసము మొదలగువానిమూలముగా పురుషునియొక్క గర్భమున ప్రవేశించి అచట కొన్నాళ్లుండి మరల యెప్పుడు పురుషుడు శుక్లమును స్త్రీయందుంచు చున్నాడో అప్పుడు తండ్రియగు పురుషుడు జీవుని సృష్టించు

చున్నాడు. ఇట్లు పురుషదేహమునుండి జీవుడు రేతోరూపమై బయటకువచ్చుటయే జీవుని మొదటిజన్మము.

శ్రుతి:—తత్ స్త్రియా ఆత్మభూయమ్, గచ్ఛతి యథా(2)

తా॥ పురుషునిచే స్త్రీగర్భమునం దుంచబడిన శుక్లము వృద్ధిబొందుచున్నప్పటికిని స్త్రీకి స్తనాద్యవయవములవలె నుండునుగాని భారము లేదు. ఆ గర్భిణీస్త్రీ తన భర్త యుదరంబునందలి శుక్లము తన యుదరమున జేరిన దని తెలిసికొని దానిని అనుకూలాద్యాహారాదులచే వృద్ధిబొందించుచున్నది.

శ్రుతి:—సాభావయిత్రీ భావయితవ్యా భవతి......(3)

తా॥ ఇట్లు గర్భమును వృద్ధిబొందించుచున్న యా స్త్రీ భర్తచేత సంరక్షింపబడుచున్నది. ఆ స్త్రీయు ఆగర్భమును గర్భధారణవిధితో క్రమప్రకారము భరించుచున్నది. ఆతండ్రి యగు పురుషుడును పుత్రజన్మమునకుముందు గర్భాధానమును, సుఖప్రసవము కలుగుటకొరకు సీమంతాది సుకర్మల నాచరించుచు పుత్రజన్మానంతరము జాతకర్మాదులచేతను స్త్రీ గర్భము కాపాడుచు పోషించుచున్నాడు. ఇట్లు పురుషుడు గర్భమును సంరక్షించుట యనునది తన్ను తాను సంరక్షించుకొనుట యగుచున్నది. ఇట్లు పురుషుడు స్వసంతానము గనుట యనునది భగవంతుని ప్రపంచసృష్టియనే యజ్ఞమునందు తనవంశమనే తీగను వృద్ధిబొందించుట కని యెరుంగునది. ఈప్రకారము సకలజీవులును వానివాని సంతానవంశపరం

పరలచే సృష్టిని పోషించుటయే భూతకోటిధర్మము అని యెరుం గునది. కనుక జీవుడు యీరీతిగా తల్లిగర్భములోనుండి కర చరణాద్యవయవములతోఁగూడి భూమిలో బయటకు వెడ లుట రెండవజన్మమగుచున్నది.

శ్రుతి:-సోఽస్యాయమాత్మాపుణ్యేభ్యః,కర్మభ్యః,ప్రతిధీయతే అథాస్యాయమితరఆత్మాకృతకృత్యోవయోగతః,ప్రేతిస్వ ఇతఃప్రయన్నేవ పునర్జాయతే, తదస్య తృతీయం జన్మ.
—ఐతరే. 2 అ. 3. ఖణ్డ.

తా॥ ఇట్లు ఆ తండ్రికి యీ కుమారుడు గలుగుట తండ్రిసంబంధమైన గృహస్థపుణ్యకర్మల నన్నిటిని నితఁడు మరల ధరించి నడచుచున్నాడు. అనగా ఈ తండ్రి తనకు బదులుగా యీ పుణ్యకర్మలయందు తన కుమారుని నియ మించి తాను త్రిఋణవిముక్తుఁడై మృతినొందుచున్నాఁడు. అనంతరము యీ కుమారుడు తన తండ్రియాజ్ఞ నెరవేర్చు టకు ఆ గృహస్థానమందు అధిష్ఠించుటయే మూడవ జన్మము. దానితో నీతడు సంసారమును బొందుచున్నాడు.

అనగా ప్రతిమానవుడు ప్రథమమున తండ్రిశరీ రమునందు మిక్కిలి అశుచియైన రేతోరూపముగానుండుట మొదటిజన్మము. అనంతరము తల్లిగర్భమున కరచరణాద్యవ యవములతో బెరిగి బయటవచ్చుట రెండవజన్మము. తదుపరి పెరుగుచుండగా తండ్రియాజ్ఞచొప్పున గృహస్థధర్మము నెరవే

ర్చుటకు ప్రవేశించుట మూడవజన్మము. ఈవిధముగా అవిద్యా కామకర్మములుగల ప్రతిజీవుడు త్రివిధజన్మములతో త్రివిధ అప్పులతో సంసారమును బొందుచున్నాడు.

సుజనులారా! ఈవిధముగా శ్రీ భగవంతునిచే జగత్సృష్టినిర్మాణసమష్టితత్త్వరహస్యమును గుఱించి హిందూ మతమునకు ప్రథమవేదంబైన ఋగ్వేదముయొక్క 11 వ అధ్యాయమునందు చెప్పబడియుండెను. ఇట్లు పరమాత్మచే ప్రపంచము ప్రథమమున సృజింపబడునపుడు పంచభూతముల సమ్మేళనచే జలంబునుండియే దేవమనుష్యాది సర్వజీవులను సృజించెననియు అందు మానవులగు ప్రతియొకనికి తండ్రి గర్భప్రవేశాదిగాగల మూడుజన్మములను బొందుచున్నాడనియు అందు ప్రతియొకమనుష్యుడును యీలోకములో భగవదాజ్ఞానురూపములైన మూడుపనులు దీర్చవలసియున్నాడనియు అవి యేవేవి యనగా మాతాపితరుల పోషించి వారి సంబంధమైన గృహస్థసుకర్మభారమును తాను వహించి శ్రీ భగవానుని జగత్సృష్టివృద్ధినిమిత్తము స్వసంతానము బడయుటయును.

రెండవది ఇంద్రాదిదేవతల తృప్తికొఱకు దైవారాధన జేయుచు అతిథి అభ్యాగతుల పోషణతో భూతదయగలిగి ధార్మికుడై వర్తించుటయును.

మూడవది సత్యసమష్టి, సద్గురుభక్తి, దైవభక్తి సాంప్రదాయకుడైన యొకసద్గురునివలన తనను యీలోకమునకుబంపించినవాఁ డెవ్వఁడో తానెవరో యిట్టి రహస్యతత్త్వవిచారణదెలిసికొని స్వానుభూతిని బొంది చిత్తవిశ్రాంతి, నిత్యానందానుభూతి నిర్మమత నిర్వికారముకలవాఁడై యీ లోకమున నటించుచు తనయొద్దకు నెవ్వరైనను ఈ బ్రహ్మవిద్యను చెప్పుమని శమదమాదిసాధనచతుష్టయములుగల మనుజుఁడు వచ్చి బోధించుమని ప్రార్థించినయెడల వారలకీ విద్య జెప్పుచుండుటయు, ఈ మూడుధర్మములును ప్రతియొకమానవునకు మూడుఋణములై తీర్పించుకొనుటకు ఎదురుచూచుచున్నవి. కనుక ప్రతి మానవుఁడును ఈ గ్రంథమునందు రెండవ అధ్యాయమున నిరూపించుప్రకారము గృహస్థాశ్రమమున జేరి పితృఋణము. దేవఋణము, ఋషిఋణములను తీర్చుకొని ఇహపరసౌఖ్యంబు లనుభవించుదురుగాక.

ఋగ్వేద ప్రపంచసృష్టిక్రమణవిచార సమాప్తము.

—♦ ద్వితీయభాగము. ♦—

# అథర్వణవేద జగత్సృష్టి క్రమవిచారణ

## తదంతర్గతంబైన ముండకోపనిషత్.

శ్రుతి:— యథాసుదీప్తాత్పావకాద్విస్ఫులింగాః, సహస్రశః ప్రభవంతేసరూపః, తథాక్షరాద్వివిధాః సోమ్య, భావాః ప్రజాయన్తే, తత్రచైవాపియన్తి

తా॥ మండుచున్న అగ్నిహోత్రమునుండి అగ్నిరూపము లగు మిణుగురు లెట్లుద్భవించుచుండునో అట్లే స్వయం ప్రకాశస్వరూపమైన పరమాత్మనుండి పరమాత్మాంశంబు లగు జీవకోటు లుద్భవించుచున్నవి. (అందు కనుగుణముగా శ్రుతిప్రమాణము.)

శ్రుతి:—యతోవా ఇమాని భూతాని జాయన్తే,
యేన జాతాని జీవంతి
యత్ప్రయంత్యభిసంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ.

తా॥ అనగా యేపరమాత్మనుండి సమస్తజీవకోటు లుద్భవించుచున్నవో, యే పరబ్రహ్మమునుండి సమస్తభూతములు జీవించుచున్నవో మరల యేయొక్క పరమాత్మయందు లయంబు బొందుచున్నవో అదే పరబ్రహ్మమని తెలిసికొన్నచో తాను బ్రహ్మస్వరూపు డగునని తైత్తిరీయము. తత్సంబంధమగు మఱియొక ప్రమాణము.

శ్రుతి.—బ్రహ్మ భేదేన జానాతి, స ముక్తిం నైవపద్యతే
సమానంసర్వజంతూనాం, బ్రహ్మసూత్రేణ కథ్యతే.

తా॥ ఎవడు పరమాత్మను భేదబుద్ధితో జూచునో వాడు ముక్తి నొందంజాలడు. పరబ్రహ్మము సర్వజంతువులయందు సమానముగ నున్నదనియు,ఆబ్రహ్మమే యన్నియాత్మలనియు శ్రీ వేదవ్యాసులు బ్రహ్మసూత్రముచే నుడివెను. అనగా ఇచట భూతములను భేదబుద్ధితో జూచుటయే పరబ్రహ్మ

2

మును భేదించుట యని సమష్టితత్వరహస్యము వెల్లడించుననిగమనించునది. అందువలననే.

శ్లో॥ జ్ఞానం సర్వాంతరం భాతి, కూటస్థాత్మస్వరూపకం
ప్రజ్ఞామాత్రమిదం సూక్ష్మం, కోపిజానాతిపుణ్యకృత్.

తా॥ అనగా సమస్తప్రాణికోటుల హృదయమునందు ప్రజ్ఞామాత్రమై వెలుఁగుచుండు కూటస్థాత్మస్వరూపమైన ప్రత్యగాత్మ ప్రకాశించుచున్నది. కనుక అట్లు "మమాత్మా సర్వభూతాత్మా" అను న్యాయంబున నన్ని యిండ్లలో అనేక రూపములతో అగ్ని ఒక్కటియె దీపపుజ్యోతులై ప్రకాశించుచున్నట్లు, పరమాత్మయు పిపీలికాదిబ్రహ్మపర్యంతముగల భూతకోటిశరీరంబులందు ప్రత్యగాత్మస్వరూపములతో వెలుంగుచున్నది. అట్టి తనయాత్మను పుణ్యకర్మలు సేయువా డెవ్వ డెరుంగకుండును. అని ఋభుగీత వచించెను. కాన సుజనులారా !

"ఏకమే వాద్వితీయం బ్రహ్మ" యనియు
"సర్వం ఖ ల్విదం బ్రహ్మ" యనియును

అనగా సర్వం బ్రహ్మమే, తదన్యం కించిత్ నాస్తి నాస్తి, లేదు."బ్రహ్మసత్యం జగన్మిథ్యా"అను శ్రుతిప్రమాణముల ననుసరించినట్లు ఆత్మజ్ఞులచే సదా శిష్యపరంపరా శ్రవణమననాదితత్వానుభవవిచారణ పొందబడుచున్నది ఎట్లన.

శ్రుతి॥గా॥ "ఏమీలేదు యీయుత్త బట్టబయలు."
అనగా రూపనామక్రియలతోఁ గూడికొనినటువంటి నీకుదోఁచు
చున్నటువంటి యే దృశ్య జాలమున్నదో అది యంతయు,

శ్రుతి:—యథాతరంగకల్లోలైర్జలమేవ స్ఫురత్యలం,
ఘటనామ్నా యథాపృథ్వీ పటనామ్నాహి తంతవః,
జగన్నామ్నా చిదాభాతి, సర్వం బ్రహ్మైవ కేవలం.

తా॥ సముద్రపునీటినుండి తరంగములు, ఉప్పు, ఫేనము
గలిగినప్పటికిన్ని అవి జలముకన్న వేరు గానట్లును, మన్నొ
క్కటే బుంగలు, చట్లు, కుండలు అను నానావిధనామ
ములు పొందినప్పటికిన్ని అవి యన్నియు, మట్టికంటె వేరు గా
నట్లును, నూలొకటే దుప్పటి, ధోవతి, యుత్తరీయంబులను
నానావిధనామముల బొందినప్పటికిని నవన్నియు నూలు
కంటె వేరు గానట్లును, అట్లే మీకు గోచరించు ఈ నానావిధ
నామరూపములబొందు దృశ్యజాల మంతయు పరబ్రహ్మముక
న్న వేరుగాదు. అట్టి పరమాత్మ రూపనామక్రియలు లేక నిర్వి
కారనిరంజననిగమాగోచరమై బయలుస్వరూపమున దనరారు
చుండును. అయితే ప్రత్యక్షస్వరూపము శాశ్వతముగా సృష్టి
గోచర మగుచున్నట్లు శ్రుతులు ప్రతిపాదించుచున్నవే? ఇట్టి
సృష్టి ఎవ్వరును సంకల్పకర్త లేకయె యెట్లు జరుగుచుండునని
శ్రుతి ప్రతిపాదించుచున్నదని ప్రశ్న చేయుదువేని అందులకు
సమాధానము.

శ్రుతి:—అథపరాయయా, తదక్షరమధిగమ్యతేయత్తదదృశ్య మాగ్రాహ్య, మగోత్ర మవర్ణమచక్షుశ్శ్రోత్రం, తదపాణి పాదం, నిత్యం విభుం, సర్వగతం, సుసూక్ష్మం. తదవ్యయం యద్భూతయోనిః, పరిపశ్యంతిధీరాః.

—ముండకోపనిషత్.

తా॥ తరువాత పరా (ఉత్కృష్ట) విద్య చెప్పబడును. ఏవిద్యచే సాక్షాద్ పరతత్త్వము తెలియబడునో అది పరా విద్య. ఆయక్షరతత్త్వము, అదృశ్యము, అగ్రాహ్యము, గోత్ర రహితము, వర్ణరహితము, చక్షుశ్శ్రోత్రరహితము, పాణిపాద రహితము, నిత్యము విభుసర్వవ్యాపి, అతిసూక్ష్మము, నాశ రహితము. అదే భూతములకు గారణము. ఆతత్వమును జ్ఞానులు సాక్షాత్కరింతురని శ్రుతియే వక్కాణించుటచేత.

నీకు యీ ప్రత్యక్షముగా గోచరించుచున్న భూత కోటి మొదలుగాగల దృశ్యపదార్థము లన్నియు బ్రహ్మము గానే యెరుంగుము. ఎట్లనిన. తటాకజలమందు గలుగుచున్నట్టి అలలు, జలచరము లాదిగాగలవి నీటికంటె వేరుగాక నీటికి సంకల్పమును లేక ఆ రూపకములుగా మారుచున్నట్లు పర మాత్మయు, పరిపూర్ణమై, నిత్యమై నిర్వికారమై నప్పటికిని తానే యీ దృశ్యస్వరూపముగా తన కెరుకలేకయే స్వభా వజన్యముగా పరిణమించుచున్నది.

అయితే అగ్నియందు దోఁచినపొగ అగ్ని నావరించి రూపమును మఱుగుపఱచినట్లు పరమాత్మయందు దోఁచిన మాయ తనప్రజ్ఞను మఱపించి 'శుక్తి రజితభ్రాంతి' అనగా ఎండసమయమున దూరముగా ఎండలోనున్న కాకిచిప్పను జూడగా తనకు వెండి లభించె నని విభ్రాంతుని జేసి విక్షేపింగించు నట్లును, "రజ్జుసర్పభ్రాంతి" అనగా రాత్రి చీకటిలోనున్న త్రాటిని జూచి పాము అని భ్రమింపజేసి భీతిచే నల్లాడించినచందమునను భూతరూపముగా మారినపరమాత్మయందు దోఁచిన మాయాస్వరూపము తనను నావరించి ప్రకృతి విభ్రాంతుని జేసి తనకు జనన మరణాదులు, లాభనష్టములు, సుఖదుఃఖములు కలవని వ్యష్టిభావన నమ్మకమును గలిగించి సృష్టి సదా జరుపుచున్నది. ఎట్లనిన-

శ్రుతి:—"మూలములేని గుఱ్ఱరిగే శరీరాలేమి లేవు" అనగా సృష్టికి తల్లిదండ్రియే మూలము. మఱి యెవ్వరును లేరు. ఎట్లనిన ఆకాశవర్షబిందువు వచ్చి తటాకజలమునందు పడగానే నీటికి బుద్బుదము పుట్టినట్లు స్త్రీయొక్క కామద్రవమనెడి నదియందు పురుషరేతస్సు అనే బిందువు పడగానే "మాతృపితృసంయోగేన ఆత్మావై పుత్రనామాసీత్" అను న్యాయంబున మాతృపితృ అనుబంధముచేత వారి ఆత్మయే ఒక దీపమునుండి మరియొక దీపము ముట్టించినట్లుగా యీ దంపతులకు కుమారుడుగా మరియొక భూతస్వరూపము

జనించుచున్నది. ఇక్లే సదా ప్రకృతి గోచరించుచున్నది. ఇది సత్యసమావేశ, నిత్యానంద, నిర్విషయ, నిస్సంకల్ప, నిస్సందేహ తత్త్వానుభవుడైన సద్గురువు నాశ్రయించిన వారలకు తమయొక్క స్వస్వరూపానుభవముచే యీదృశ్యజాల ప్రపంచమంతయు అదృశ్యంబై "బ్రహ్మ సత్యం, జగన్మిథ్యా" అను శ్రుత్యర్థము స్వానుభూతికి రాగలదుగాని, మఱియొక వ్రతక్రతువులచే యీ యర్థము తేటబడునదిగాదు. ఎందు వల్లననగా

శ్రుతి:—"కలలోగన్న శరీరాలు ఏలాగో ఆలాగు" అనగా రాత్రికాలమందునీస్వప్నములో ఏనుగుల, గుర్రముల నెక్కుటయు, స్త్రీసౌఖ్యము లనుభవించుటయు, అప్పటికి యథార్థముగా దోచినప్పటికిన్నీ మేలుకాంచి జాగ్రతను బొంది తాను స్వప్నమున గాంచిన పదార్థములను విచారించగా అదృశ్యమై, అగ్రాహ్యమై, మిథ్యయై తన భ్రాంతిని తాను నిందించుకొని లజ్జావిశిష్టుడైనట్లు ప్రతియొకమానవుడును ప్రాకృతభ్రాంతి సుషుప్తినుండి ప్రజ్ఞానవ్యక్తిని బొంది తానిదివరలో నాభార్య, నాపిల్లలు, నాధనము, నాకులము, నా స్థలము అని ఆభాసముగా స్వప్నవిచారణసంతోషమును గురించి తాను బడినటువంటి వ్యర్థమాయాభిలాషను గురించి తనును తాను నిందించుకొని మహావాక్యార్థానుభవుడై నిమిత్తమాత్రముగ నివృత్తిమార్గమున విజ్ఞానమను తెప్పచే

సంసారసముద్రమును దాటుటకు కావలసిన శ్రుతి విధి యుండగా అజ్ఞానముచే ఆకాశమున ధనము సంపాదింప ప్రయత్నించినట్లు వాచాలత్వముగా యీపైవిచారణమంతయు చెప్పుటయును సమష్టిని స్వానుభూతిని బొందనేరక వ్యష్టి వ్యసన వ్యాపారగ్రస్తులై ప్రకృతిని విసువంజాలక మాయా స్మృతి చట్టములను నమ్ముకొని విట్టినీగెడి వ్యర్థవ్యాపారులకు యీయర్థము స్వానుభూతికి కోటిజన్మములకు లభించునదిగాదు.

ఇది సత్యము సత్యము.

ఇట్లు అధర్వవేదసృష్టి విచారణ క్రమము.

ఇది శ్రీమన్నారాయణవరప్రసాదలబ్ధ పోకా వేంకటకృష్ణ దాస ప్రణీతంబైన ఋగ్వేదప్రకృతిసృష్టివిధి విచారణయు, రెండవది అధర్వవేద సృష్టి క్రమ విచారణయుగల జాతీయసమష్టి ధర్మ తత్త్వరహస్యమందు ప్రథమాశ్వాసము సర్వము సంపూర్ణము.



ఓమ్

శ్రీ గురుభ్యోనమః

# జాతీయసమష్టిధర్మతత్త్వరహస్యము

## ద్వితీయాశ్వాసము.



## ప్రథమభాగము.

పురాణాంతర్గతంబగు

## బ్రహ్మాండసృష్టిక్రమవిచారణ.



### —♦ బ్రహ్మజనన విరాట్స్వరూప నిర్ణయము ♦—

శ్లో॥ ఏకార్ణవే మహాఘోరే, సమోభూతే సమంతతః
సుష్వాపాంభసి యోగాత్మా। నిర్మలో నిరుపప్లవః
సహస్రశీర్షా విశ్వాత్మా। సహస్రాక్షః సహస్రపాత్
సహస్రబాహుస్సర్వజ్ఞ । స్సర్వదేవ భవోద్భవః.
హిరణ్యగర్భో రజసా । తమసాశంకరస్స్వయం
సత్వేన సర్వగోవిష్ణు । స్సర్వాత్మత్వే మహేశ్వరః
కాలాత్మా కాలనాభిస్తు । శుక్లకృష్ణస్తునిర్గుణః
నారాయణో మహాబాహు। స్సర్వాత్మాసదసన్మయః

—లింగపురాణము-పూ. భా. 17 అ.

తా॥ అన్ని వైపులందు జలముచే నిండినదియు అతి భయంకరమైనదియు, చీకటిచే సర్వత్రి వ్యాపించినదియు నై యుండు సమయమునందు నిర్మలుండును దుఃఖరహితుండును, యోగస్వరూపుండును, అగు శ్రీమన్నారాయణుండు ఆజల మునందు శయనించియుండును. అట్టి సర్వజ్ఞుండగు ఆదినారా యణుండు తానే రజోగుణముచే బ్రహ్మదేవుడుగను, తమో గుణముచే రుద్రుడుగను, సత్వగుణముచే విష్ణువుగను, సర్వా ధారుండైనందువలన మహేశ్వరుడుగను, కాలరూపిగను, కాలమునకు స్థానభూతుడుగను, తెలుపు నలుపు వర్ణముగల వాడుగను, నున్నాడు. ఇట్టి జగదీశ్వరుడు కోరిక గుణము లేని వాడుగ నుండినను, మహాశక్తివంతుడగు శ్రీమన్నారాయ ణుడు సత్స్వరూపముగను అసత్స్వరూపముగను, సమస్త స్వరూపముగను నై యున్నాడు. [అట్టి శ్రీభగవంతుడు]

శ్లో॥ ప్రకృతిం పురుషంచైవ, విద్ధ్యనాదీ ఉభావపి
వికారాంశ్చ గుణాంశ్చైవ-విద్ధి ప్రకృతి సమ్భవాన్.
— భగవద్గీత, 13 అ. 20 శ్లో.

తా॥ అనగా ప్రకృతి, పురుషు లిద్దరును అనాదిగా నున్నవారలనియు, అందు పురుషుడు నిర్వికారుడు, ప్రకృతి చంచలాంశము నైనదనియు.

అనిచెప్పెడు భగవద్గీతా వాక్యానురీతి అచంచలమైన యాకాశమునందెట్లు చంచలాంశమైన వాయువొకటి నైజము

గానుండెనో అట్లే శుద్ధసత్వపరిధానంబనే తెల్లనిదియగు సద్గుణమును గలిగియుండు నిర్వికార నిరంజన నిగమాగోచరమైనట్టి శ్రీమన్నారాయణుని నిజస్వరూపమునందు నైజమై, సనాతనమై తామసగుణ స్వరూపంబనే నల్లని వర్ణముగలిగి త్రిగుణసంయుక్తంబైన, మాయాదేవి యొకటి అనగా "దైవీహ్యేషాగుణమయీ మమ మాయా" అను భగవద్గీతావాక్యరీతిగా గాయత్రిశక్తి అనునది నివాసమైయుండి యొకానొకప్పుడు జగత్సృష్టి ప్రేరేపణ గలిగించి అందు పంచభూతవిభాగముచే ఇరువదినాలుగు తత్వములు ఇరువదియైదవది యగు జ్ఞాతయనెడి జీవుడు ఇరువదియారవదియగు సాకారమనెడి ప్రత్యగాత్మ తత్వము లనునవి గలవు. గనుకనే ఉపనయన యజ్ఞోపవీతమునందు 27 పోగులుంచిరిగాని ఇట్టి సమస్త తత్వప్రేరేపణస్వరూపంబైన మాయనంతయు ఇరువదియేడవదియగునట్టువంటి శ్రీమన్నారాయణునియొక్క నిత్యమైన నిజస్వరూపమునందు ప్రళయాదికాలంబునందు లీనమగుచుండును. ప్రళయాంతమందు శ్రీ భగవంతుని ఇచ్ఛాప్రకారము జగత్సృష్టిరూపముగా పరిణమించుచుండును. కనుక సృష్టిప్రకారము వినుడు.

శ్లో॥ యోసావతీన్ద్రియగ్రాహ్య, స్సూక్ష్మోఽవ్యక్తస్సనాతనః
సర్వభూతమయోఽచిన్త్య, స్సఏవ స్వయముద్బభౌ

సోభిధ్యాయ శరీరత్స్వాత్, సిసృక్షు ర్వివిధాః ప్రజాః
అపఏవ ససర్జాదౌ తాసు బీజ మపాసృజత్.
—రాజయోగ. 1 అ. 25-26 శ్లో.

తా॥ నేత్రాదీంద్రియములచే నెరుగబడని వాడును, మనస్సుచేతనే తెలియదగినవాడును, వ్యక్తముకానివాడును, శాశ్వతుడును, సర్వభూతమయుండును, చింతింపనలవికాని వాడును అగు శ్రీమన్నారాయణుండు తానే స్వయముగా (జగత్సృష్టికి) ప్రాదుర్భవించెను. అట్లు శ్రీ పరమేశ్వరుడు సకల జీవులను సృష్టింప నిచ్ఛగలవాడై తన శరీరమునందుండి మొదలు జలమును గలుగజేసి దానియందు తన శక్తిరూప మగు బీజము నుంచెను. (అందువలననే శ్రీ భగవంతునకు ఇట్లు నామకరణశబ్దోత్పత్తి గలిగెను.)

శ్లో॥ ఆపోనారా ఇతి ప్రోక్తా, ఆపోవై నరసూనవః
తాయదస్యాయనంపూర్వమ్, తేననారాయణస్స్మృతః.

అనియును "నారః, ఆపః, స్థానం, యస్య సః నారాయణః (అనియును.) అనగా, నారము లనగా జలము. అట్టి జలము నందు తనశక్తిరూపమునుంచి జీవులను జలమునుండియే సృష్టింప జేసినందున ఈ జీవులను నారములని చెప్పబడును. అందు శ్రీ భగవంతుడు జలజీవాంతర్వ్యాప్తస్థానమయుం డగుటంజేసి నారాయణుం డని చెప్పంబడెను. అట్టి శ్రీమన్నారాయణుండు తనకు

జగత్సృష్టి జేయుటకు స్వసంకల్ప ముద్భవించగానే తన శరీరమునుండి ప్రథమమున జలమును గలుగజేసి ఆ జలము నందు తనశక్తి రూపమగు బీజము నుంచగా

శ్లో॥ తదణ్డ మభవ ద్ధైమమ్, సహస్రాంశుసమప్రభమ్
తస్మిన్ యజ్ఞే స్వయంబ్రహ్మ, సర్వలోకపితామహః.
—రాజయోగ. 1 అ. 27 శ్లో.

తా॥ ఆ బీజము భగవంతుని యిచ్ఛాప్రకారము స్వర్ణమువంటి కాంతియును, సూర్యునివంటి తేజస్సునుగల అండమాయెను. అం దుండి సర్వలోకపితామహు డగు బ్రహ్మదేవు డుద్భవించెను. (ఇదియే మఱియొక శాస్త్రాభిప్రాయమునం దిట్లున్నది.

శ్లో॥ తస్య సుప్తస్యనాభౌతు, మహత్పద్మ మభూత్కిల
పద్మమధ్యేఽభవద్బ్రహ్మ, వేదవేదాంగభూషణః,
—హారీతస్మృతి-10 శ్లో.

తా॥ ఆ నిద్రాశయ్యయం దున్న శ్రీ భగవంతుని యొక్క నాభియందుండి కలిగిన గొప్పపద్మమునుండి వేద వేదాంగములు భూషణములుగాగల చతుర్ముఖబ్రహ్మ యుద్భవించెను. ఇందుల కనుగుణముగా భాగవత ద్వితీయస్కంధము-221-225 పద్యములు.

“సీ॥ ఎవ్వానినాభియం దెల్లలోకాంగసం
స్థానకారణపంకజంబు వొడమె

నం దుదయించి సర్వావయవస్ఫూర్తి
దనరారునట్టి పితామహుండు
... ... ... ... ”

“సీ॥ హరిపాదభక్తి రహస్యోపదేష్టయు
నఖిలదేవతలకు నధివిభుండు
నైన విధాత గల్పాదియందున, నిజా
శ్రియపద్మమున కధిష్ఠాన మరయ
నర్థించి జలముల నన్వేషణము జేసి
నలినంబు మొదలు గానంగ లేక
విసివి క్రమ్మఱను దద్బిసరుహాసీనుడై
సృష్టినిర్మాణేచ్ఛ చిత్తమందు
జాల నూహించి తత్పరజ్ఞానమహిమ
సరణి మనమున దోపక జడనుపడుచు
లోకజాలంబు పుట్టింప లేక మోహి
తాత్ముడై చింతనొందు నయ్యవసరమున.”

తా॥ అనగా శ్రీమన్నారాయణుని యొక్క నాభికమలమునుండి చతుర్ముఖబ్రహ్మ యుద్భవించి తానుజనించి యున్న పద్మనాళమూలము కనుంగొనవలయునని సర్వత్రవ్యాపించి మహార్ణవముగా నున్నట్టి జలమునందు ప్రవేశించి నాళమూలమును గనుంగొన లేక వేసారితిరుగ పద్మములో ప్రవే

శించి జగత్సృష్టి జేయవలయునని సంకల్పించి ప్రయత్నించగా లోకనిర్మాణంబు సేయుటకు తనచేతగాక నల్దిక్కుల జూచి నే నెందులకు జనించితిని? నాకు తండ్రియెవరు? అని తనలో తాను చింత తలపోయుచున్న వేళ,

ఆ జలమునుండియే తప, తప, అనుశబ్దమొకటి యా బ్రహ్మదేవునకు వినవచ్చెను. అంత నాచతుర్ముఖుండు నల్దిక్కులజూచి యెవ్వరు కనుపించనందువలన తనలో దాను యూహించి యూహించి యీశబ్దధ్వని నన్ను తపస్సు చేయుమని హెచ్చరిక చేయుచున్నదని దృఢప్రజ్ఞతో తలపోసి తాను నివసించియుండు పద్మముననే ఆ బ్రహ్మదేవుడు కొన్నివత్సరములు తపస్సుచేయుచుండగా శ్రీమన్నారాయణుం డాతనికి సాక్షాత్కరించెను. అంత,

క॥ వరపరమహంసగమ్యా
స్మరణం దనరారు పరమపురుషుని పదపం
కరుహములకు నజుడు చతు
శ్శిరములు సోకంగ నతులు సేసిన హరియుగ॥

—భాగవతం, అధ్యా 2.

పైన జెప్పిన ప్రకారము శ్రీమన్నారాయణుండు బ్రహ్మకు విరాడ్విగ్రహుండై బ్రహ్మాండాకారంబున సాక్షాత్కరించిన నజుడు శ్రీభగవంతునకు సాష్టాంగనమస్కారంబులు గావించి లేచి నిలిచి ఆవిరాట్పురుషునియొక్క అవయవ

ములలో యీజగత్సృష్టిపరికరంబులైన యీదిగువ కనుప రచునట్టి మహదహంకార పంచభూతాత్మకమగు,

తే॥ గీ॥ మహదహంకార పంచతన్మాత్రగగన
పవనశిఖితోయ భూ భూతపంచకేంద్రి
యప్రపంచంబు భగవంతునందుగనుట
సర్గమందురు దీనిని జనవరేణ్యా. భాగ- 2 అ-260 ప.

అను భాగవతప్రమాణమునందు యీపైన వక్కాణించినట్టి మహత్తత్వము, అహంకారతత్వము శబ్దాదులగు పంచతన్మాత్రలు, పంచభూతములు, దశేంద్రియములు, వాటి వాటి అధిదేవతలును ఇట్లు సృష్టిపరికరములు శ్రీవిరాట్పురుషునియందు బ్రహ్మకు గోచరించెను. ఇట్టివిషయమును గురించి ఋగ్వేదాంతర్భూతంబైన ఐతరేయోపనిషత్తు ప్రమాణము. శ్రీవిరాట్పురుషునియందు యీపైనజెప్పిన అధిదేవతాది పరికరములు మాత్రమే సృష్టింపబడినట్లు ముందు యీగ్రంథాదియందు వ్రాసియున్నాను. ఎల్లరును గ్రహించునది. అట్లే బ్రహ్మకు యీవిరాట్పురుషునియందు యీదిగువ కనబరచు సృష్టిపరికరములు మాత్రము గోచరించెను. ఎట్లనగా,

శ్రీవిరాట్పురుషునిముఖమునందు ఆత్మ ఆదిశక్తితో గూడుకొనియుండుటయు కంఠమునందు జీవుడు మాయాశక్తియుక్తుడై యుండుటయు, హృదయమునందు రుద్రుడు జ్ఞానశక్తితో నుండుటయు, నాభియందు విష్ణువు ద్రవ్యశక్తితో.

నుండుటయు, గుహ్యస్థానంబున బ్రహ్మవిద్యాశక్తితో గూడుకొనియుండుటయు, పాయుస్థానంబునందు గణపతి క్రియాశక్తితో గూడుకొని యుండుటయు, ఇట్లా విరాట్పురుషుని యందు షట్చక్రాధిదేవతలను యీ యజుడు గాంచెను.

తిరుగ ఆ విరాట్పురుషునియొక్క కంఠమునందు ఆకాశమును, హృదయమునందు వాయువును, నాభియందు అగ్నియును, మేఢ్రస్థానంబున జలమును, మలస్థానమున పృథ్వియును ఇట్లు పంచభూతములను బ్రహ్మదేవుడు గాంచెను.

తదుపరి మరల ఆ విరాట్పురుషునియొక్క నేత్రములయందు సూర్యుడు, మనస్సునందు చంద్రుడు, శ్రోత్రములయందు దిక్కులు, నాసికమునందు అశ్వినీదేవతలు, జిహ్వయందు వరుణుడు, వాక్కునందు అనలుడు, హస్తమునందు యింద్రుడు, పాదములందు ఉపేంద్రుడు గుహ్యమునందు ప్రజాపతి, పాయువునందు మృత్యువు నివసించియుండుట ఆయాదేవతాస్థానము లీచతుర్ముఖుడు ఈ ముందుచక్రము నందు (35 వ పేజిని) కనబడు నంశము లన్నియు మాత్రము గాంచెను. కాని ముఖమునందు బ్రాహ్మణులును, బాహువులందు రాజులును ఇట్లు నాలుగు జాతులవారు మాత్రము బ్రహ్మకు గోచరింపలేదు. ఈ విషయమును గురించి ముందు వ్రాసెదను. అంత శ్రీ భగవంతుండు దివ్యమంగళ విగ్రహ రూపంబున బ్రహ్మకు బ్రసన్నవదనంబున గోచరించి యిట్లనియె.

తే॥ గీ॥ భద్ర మగుగాక నీకు నో పద్మగర్భ!
వరము నిపు డిత్తు నెఱిగింపు వాంఛితంబు
దేవదేవుడ నగు నస్మదీయపాద
దర్శనం బవధి విపత్తిదశల కనఘ. భాగ. 2 అ.

వ॥ శ్రీ భగవంతుండు బ్రహ్మను దీవించుచు నిట్లనియె. 'ఓయి వత్సా! ఈజగత్సృష్టి సంకల్పాధిష్ఠాన భ్రాంతి నీయందు పొడచూపి నీవు భక్తియోగంబున నన్ను సంతసింపజేసి యున్నందున నీకు నే సాక్షాత్కరించి సృష్టిపరిణామ పరికరంబులగు సర్వము నాయందు నీకు జూపించితిని. కనుక నీవు బ్రహ్మాండ స్వరూపుండ నైన నాయందు ఏ యే స్థానంబునందు ఏ యే అధిష్ఠాతకార్యంబులు కనుంగొంటివో అట్టిసర్వ విధాన పరికరంబులతో పిండాండ రూపంబులైన యీలోకంబునందు గల మనుష్యాది సర్వభూతములయందును ఒక్కొక భూతమునందు నాయందు గోచరించినట్లు సర్వభూతాది దేవతలతో పిండాండరూపమునందు ఇమిడి యుండునట్లు సృష్టింపుమని బ్రహ్మకుజెప్పి శ్రీ భగవంతుం డదృశ్యుం డాయెను.

"సీ॥ అవనీశ బ్రహ్మ యిట్లంతర్హితుండైన
పుండరీకాక్షుని బుద్ధినిలిపి
యానందమును బొంది యంజలి గావించి
తత్పరిగ్రహమున తనదుబుద్ధి

గైకొని పూర్వప్రకారంబునను సమ
స్తప్రపంచంబును దగసృజించి..."

అను ప్రమాణము ననుసరించి చతుర్ముఖబ్రహ్మ సర్వలోకములను సర్వభూతములయందును యీదిగువ కనుపఱచు సృష్టిపరికరములతో సృజింపఁ యత్నించి,

శ్లో॥ బ్రహ్మణోఽవ్యక్తాఽవ్యక్తాన్మహత్, మహతోఽహంకారః
అహంకారాత్పంచతన్మాత్రాణి, పంచతన్మాత్రేభ్యో పంచ
మహాభూతాని పంచమహాభూతేభ్యో, అఖిలంజగత్.

అనగా పరబ్రహ్మతత్వమును ప్రత్యగాత్మతత్వమును మహత్తత్వమును అహంకారతత్వమును పంచతన్మాత్రలును పంచమహాభూతము లాదిగాగల యిరువదియేడు తత్వములు పిపీలికాది బ్రహ్మపర్యంతమును ఒక్కొక్క భూతమునందు తాను ముందు శ్రీ విరాట్పురుషునియందు గాంచినట్టి ఈ యిరువదియేడు తత్వములే పిండాండభూతమునందు నిమిడియుండునట్లు బ్రహ్మ సృజియించ సమకట్టి సర్వలోకంబులును ముందు చెప్పబోవురీతిగా సృజించెను. అయితే శ్రీ విరాట్పురుషునియందు గాంచినట్టి సర్వలోకదేవతా సమూహములును పిండాండరూపములైన యీ ఒక్కొక్కభూతమునందు కలవా యను సందేహము కలవారలు శాస్త్రదృష్టాంతమును వినుడు.




పంచీకరణచక్రము.

శ్లో॥ ఇదానీం నరదేహస్య శృణు రూపద్వయం ఖగ
వ్యావహారికమేకంచ, ద్వితీయం పారమార్థికం
తిస్రఃకోట్యోఽర్ధకోటీచ రోమాణి వ్యావహారికే
సప్తలక్షాణి కేశాస్స్యు ర్నఖాఃప్రోక్తాని వింశతి
ద్వాత్రింశద్దశనాఃప్రోక్తా స్సామాన్యాద్వినతాసుతః
మాంసంఫలసహస్రంతు । రక్తంఫలశతంస్మృతం.
—గారుడపురాణము 15 అ. 48 శ్లో.

ఓయి గరుడుడా:—

తా॥ వ్యావహారికమనియు, పారమార్థికమనియు మానవశరీరము రెండు తెఱంగులై యుండును. (ఇందు వ్యావహారిక మనగా స్థూలదేహ మనియు, పారమార్థిక మనగా సూక్ష్మదేహమనియు నెరుంగునది.) అందు వ్యావహారికశరీర లక్షణములు వివరించెద వినుము. దీనియందు 3,50,00,000 మూడుకోట్ల యేబదిలక్షల రోమములును యేడులక్షల కేశములును ఇరువదిగోళ్లును ముప్పదిరెండు దంతములును సహస్రఫలములయెత్తు మాంసమున్ను నూరుఫలములు రక్తమున్ను గలిగి ముందు కనుపరచిన చక్రానుకూలముగ స్థూలపంచీకరణవిచారణ ననుసరించి యుండును. (ఇక పారమార్థిక శరీరలక్షణము సెప్పెదను వినుము. అనగా మానవుని యొక్క సూక్ష్మదేహలక్షణములని తెలియునది.)

శ్లో॥ భువనానిచ సర్వాణి, పర్వతద్వీపసాగరాః
ఆదిత్యాऽద్యాగ్రహాస్సంతి, శరీరే పారమార్థికే
పారమార్థికదేహేహి, షట్చక్రాణిభవంతిచ
బ్రహ్మాండేయేగుణాఃప్రోక్తా, స్తేऽప్యస్మిన్నేవసంస్థితాః
—గారుడ. 15 అ. 53 శ్లో.

తా॥ పారమార్థిక శరీరమునందు పదునాలుగు లోకములును పర్వతములును ద్వీపములును సాగరములును సూర్యాది దేవతాగ్రహములును మూలాధారాది షట్చక్రములును వేయేల బ్రహ్మాండమునందుగల సర్వవస్తువులును యీ పిండాండమునందు గలవు. అనగా మానవునియొక్క దేహమునందు శ్రీ విరాట్స్వరూపమంతయు నున్నదని శ్రీమన్నారాయణుండు స్వయముగా గరుడునితో జెప్పెను.

కనుక సుజనులారా! ఇప్పుడీ ప్రమాణమునందు బ్రహ్మాండరూపుండైన శ్రీ భగవంతుండగు విరాట్పురుషుని యందు ఏయే అంశములుండెనో ఆయంశములన్నియు పిండాండ స్వరూపుండైన యీమానవుని దేహమునం దిమిడియున్నవియని గదా చెప్పినది. ఇట్టి విషయమును గురించి విచారించునపుడు మానవుని దేహమందు బుట్టువలయునా లేదా గ్రహించుడు. ఇది యిట్లుండనిమ్ము. మరియొక ప్రశ్న కలదు. ఎట్లనిన "యజ్ఞోవై విష్ణుః" అను న్యాయంబున శ్రీ మహావిష్ణువు యజ్ఞస్వరూపుం

డనియు ఆ (శ్రీ) దేవునియొక్క శరీర
లన్నియు యజ్ఞపరికరములుగా శాస్త్రములు
కనుక మానవుని దేహ మట్లు యజ్ఞకర్తృత్వస్థా
త్వస్థానమునకు పరికరస్థానమునకు నెట్లుపర
సందేహముతో బ్రశ్నించు వారికి వేదవాక
వినుడు.

శ్రుతి:— హృదయే దక్షిణాగ్ని రుదరే గా
చాహవనీయం, యజతే పురుష
బుద్ధిం పత్నీం, పరిగృహ్యాదీక్షాం
యాణి యజ్ఞపాత్రాణి, కర్మే
ణాని, సత్రే శారీరకే. ........
—యజుర్వేదాంతర్గతంబైన గర్భోపనిష
తా॥ (మనుజుని) హృదయమునందు
ఉదరమునందు గార్హపత్యాగ్నియు ముఖము
యాగ్నియు నున్నవి. కావున పురుషుడు
యుండి బుద్ధిని భార్యగను, సంతోషమును దీ
ద్రియములను యజ్ఞపాత్రలుగను, కర్మేంది
కరణములుగను గావించుకొని యజ్ఞమును జే
శారీరయాగమునందు ఆ యా దేవతలే తటస్థమై
లుగా నుండి ఆయాస్థానములయందు దేవతలు
చేయుచున్నారు. ఆయాగమునందు యీశరీరస్థ

శిరఃకపాలమే యజ్ఞగుండము. కేశములే దర్భలు. ముఖమే అంతర్వేది. జీవించియుండుకాలము యాగకాలము. దహరశబ్దమే సామవేదము. వైఖరి యజుర్వేదము. పరాపశ్యంతీమధ్యమములు ఋగ్వేదము. క్రూరవాక్యములు అధర్వవేదము, సత్యవాక్కులు వ్యాహృతులు. కామమే యజ్ఞపశువు, మరణమే అవభృథస్నానము.

ఈ యాగమునందు అగ్నులు జ్వలించుచున్నవి. అందు దేవతలు సరియైన సంసారసుఖమును గైకొనుచున్నారు. దీనిని చక్కగా తెలిసికొనువా రందరును యజ్ఞమును జేసిన వారే. ఇట్టి జ్ఞానయాగమును జేయనివాడు జీవించియుండినను వాడు మృతినొందినవాడే. ఈ శరీరము యాగముకొరకే యాగమునుండి గలుగుచున్నది. యజ్ఞమునకు దగినట్లు వికారము బొందుచున్నది. పరిణామమును బొందెడు శరీరధారియైయున్నది. (కనుక)

సుజనులారా! నా ఆత్మహితులారా! నా సోదరీసోదరులారా! మీరు శ్రీమన్నారాయణుని కృపాకటాక్షములకు పాత్రులరై యిహపరసౌఖ్యంబు లనుభవింపదలంచితిరేని సర్వవేదసారంబగు సత్యవాక్యములను నాకు శ్రీసర్వేశ్వరుడు బోధసూపినట్లు మీకీ గ్రంథమున బోధించుచున్నాడను. మీరన్యదృష్టి లేక ఆత్మార్థానుభవమున సమష్టితత్వము స్వానుభూతిని బొంది నిర్మలమనస్కులై నిష్కాములరై వాదభేద

ములు మాని యిందలి యథార్థతత్వమును గ్రహించి దైవ భక్తి గురుభక్తి భూతదయ గలిగి స్వస్వరూపానుభవజ్ఞులై వర్తించుచు నిహపరసౌఖ్యంబు లనుభవింతురుగాక.

శ్రీ అంతర్యామియైన పరమాత్మ తనకు సృష్టి సంకల్పము దోచినంతనే సాకారము విరాట్స్వరూపమును దాల్చి "సాధిభూతాధిదైవం మాం, సాధి యజ్ఞంచయేవిదుః" అను భగవద్గీతావాక్యానుసరణి తానే అధిభూత అధిదైవిక అధియజ్ఞ స్వరూపుండై సృష్టి, స్థితి, లయ, కారణ మనే బ్రహ్మాండసృష్టి యనే యజ్ఞకర్తయై ప్రాదిర్భవించెను. ఇట్టి యజ్ఞనిర్వహణార్థమై యీ సర్వలోకభూతము లనే పిండాండస్వరూపములను తన యంశముతో సృజించి అందు మానవునిమాత్రము తన వలెనే సంకల్పవికల్పపోషణములను కార్యకారణసందర్భ కర్తృత్వస్వాభిమానముతో సృజించి యీమనుష్యునకు యీ లోకములో మూడుకార్యములను చేయుటకు నియమించి ఆయభిప్రాయమునే వేదరూపముగా విధి నియమించెను. ఎట్లనగా, "బ్రహ్మచర్యేణ ఋషిభ్యః యజ్ఞేనదేవేభ్యః, ప్రజయా పితృభ్యః ఏష ఏవ అనృణో యః, పుత్రియజ్వా బ్రహ్మచారి వాసీత్" అను తైత్తిరీయసంహితప్రమాణముగూడా ఋగ్వేదబోధానుకూలమై యీదిగువను చెప్పబోవునటువంటి త్రివిధములగు మానవుని ధర్మములు యీ పై శ్రుతులతో బోధించెను.

అవి యేవనగా మొదటిది:— "ప్రజా తంతుం మావ్య వచ్చేత్సీః" అను తైత్తిరీయ ౧౧ యనువాకము ననుసరించి ప్రతి యొకమానవుడు పితామహులు పరంపరావచ్చుచున్నట్టి సంతాన మనుతీగను చెడకుండునట్లు కాపాడుటకై గృహస్థాశ్రమమున జేరి తాను స్వసంతానము బడయుటయును అట్లు కలుగనియెడల ఆస్థానమునందు దత్తసంతానమైనను నిల్పి తనతండ్రి తనకు యిచ్చినటువంటి గృహకార్య, పంచయజ్ఞ, దాన, ధర్మ, బ్రహ్మవలోకనాది కృషిచట్టము నంతయు ఆ కుమారునికి వప్పగించగలందులకు యెదురుచూచుచు తానుమాత్రము గృహస్థాశ్రమముననుండి గృహధర్మములను నిర్వర్తించుకొను చు సదా "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకంశరణంవ్రజ" అను భగవద్గీతాభిప్రాయము ననుసరించి, ప్రతియొకడు తన మనస్సునందు నేను, నాది యను స్వకర్తృత్వాభి మానము లేక సర్వకార్యకారణకర్త జగన్నియంతయగు శ్రీ సర్వేశ్వరుడే యీ లోకమునందు గల భూతకోటియనే బొమ్మలాట నాడించుచున్నాడను తలంపుతో జ్ఞప్తిగలిగి యొకస్వాధీనము భగవదధీనమగు లోకకర్తవ్యమును మరువక భగవద్భక్తిగలిగి గృహస్థాశ్రమము నటించుచు అనంతరము తన గృహస్థధర్మభారమును తనకుమారున కప్పగించి పితృ ఋణము తీర్చుకొనుటయు,

రెండవది:—ఇంద్రాదిదేవతలు భగవంతుని యజ్ఞస్వరూపమైన బ్రహ్మాండలోకభూతములందు నిండియుండి యాదేవతలును సర్వలోకపాలకులై మీకు సర్వకార్యనిర్వహణార్థమై తోడ్పడుచున్నారు గనుక ఆదేవతలయొక్క తృప్తికొరకు "పంచయజ్ఞవిధానం తు గృహీ నిత్యం నహాపయేత్" అను స్మృతి వచనమును,

తే॥ గీ! యజ్ఞపంచక మామ్నాయమందు జెప్ప
బడియె నరులకు శ్రద్ధచే వాని నాచ
రించు మానవులకు ఫలసంచయములు
గలుగు నొనరింపకున్న బాములు పొసంగు.

—బ్రహ్మాండపురా. 1 ఆశ్వా. 722 ప.

బ్రహ్మాండపురాణము, వేదములందు సర్వులకును పంచయజ్ఞములు విధించినట్లు చెప్పుచున్నది. కనుక ప్రతియొకగృహస్థుడు అనగా పంచములాదిగా గల సర్వులును ప్రతిరోజును ప్రాతఃకాలమున బ్రహ్మయజ్ఞ, దేవయజ్ఞ, పితృయజ్ఞ, మనుష్యయజ్ఞ, భూతయజ్ఞము లను పంచయజ్ఞములచేత రెండుగంటలకాలమైనను దేవతల నారాధించుచు గృహస్థధర్మమున తాను వర్తించుచు అనంతరము యీధర్మమును తనకుమారున కప్పగించి దేవఋణమును దీర్చుకొనవలయును.

మూడవది :—మానవుడు తా నీలోకమునకు వచ్చి చేయవలసినట్టి కార్యములు రెండు నిర్వర్తించుకొన్నాడు

కనుక ఇంతటినుండి తనను బంపించిన భగవంతుని సన్నిధానము చేరవలసియున్నది కనుక అందు 'పాకస్యవహ్నివిద్ జ్ఞానంవినా మోక్షో నైవసిద్ధ్యతి' అను ఉపనిషద్వాక్యానుసరణి అగ్నిలేక భోజనపదార్థము లెట్లుపక్వము చేయుటకువీలు లేదో అట్లే మానవునకు నిర్విషయానుభవముచే బ్రహ్మజ్ఞానంబు వడయక మోక్షంబు సిద్ధించదు. అందువలన ప్రతియొక మానవుండు నిస్సంకల్ప నిస్సందేహ నిర్వైరినిశ్చల తత్వానుభవజ్ఞుడగు సద్గురువు చెంత జేరి వారివలన మహావాక్యార్థానుభవము దెలిసికొని ముముక్షుత్వమును బొంది స్వానుభూతిని వర్తించుచు తన యొద్దకు మఱియెవ్వరైనను సద్గుణగరిష్ఠులగువారు వచ్చి బ్రహ్మవిద్యను చెప్పుమని ప్రార్థించునెడల అట్టి విద్యను సద్గుణగరిష్ఠులకు బోధించుచు అనంతరము శ్రీ విరాట్పురుషునిలో సాయుజ్యాది భావమున ఐక్యమును బొందుటయే ఋషిఋణవిముక్తి యనంబడును.

ఈ పైనజెప్పినట్టి పితృఋణ, దేవఋణ, ఋషిఋణములను మూడుకార్యములను మాత్రమే యీ లోకములో ప్రతియొకమనుష్యుడు నిర్వర్తించుకొనుటయే, పిండాండరూపుండైన మానవునియొక్క గృహయజ్ఞము సమాప్తి యనంబడును. అనంతర మట్లే బ్రహ్మాండరూపుండైన శ్రీ విరాట్పురుషునియొక్క జగత్సృష్టిస్థితిలయంబులను మూడు కార్యములయొక్క బ్రహ్మాండయజ్ఞము ప్రళయాంతము

సమాప్తియగును. కనుక ని ట్లీ పిండాండబ్రహ్మాండస్వరూపు లనువారు నిరువురును తదుపరి నిర్వికారనిరంజననిగమాగోచరమైన పరమాత్మస్థాన మధిష్ఠింతురు. కాన పిండాండరూపుండైన మానవునకును బ్రహ్మాండరూపుండైన విరాట్టునకును నిత్యానిత్యవివేకభేదమేగాని స్వరూపభేదంబు లే దని శ్రుతిస్మృతిపురాణేతిహాసంబులు స్పష్టపరచుచున్నవి. ఎట్లనగా.

శ్రీ భగవంతునియొక్క బ్రహ్మాండయజ్ఞమునుండి పిండాండరూపుండైన మానవుని యీ లోకములో ముందు కెను బఱచిన త్రివిధకర్మరూపమైన గృహయజ్ఞము "పాకయజ్ఞ ర్త్యజేతచ" అను న్యాయమున నిర్వర్తించగలందులకు శ్రీ భగవంతునిచే సృజింపబడియుండెను. అందు బ్రహ్మాండయజ్ఞకర్తయగు శ్రీ భగవంతుడు తన్ను తాను మఱువకయు తా నొక వస్తువును ప్రేమింపకయు సాక్షిమాత్రుడై బ్రహ్మాండయజ్ఞలీల నటించుచుండును. అందువలన శ్రీ సర్వేశ్వరుడు చేసి చేయనట్లు నిష్కర్మనిస్సంకల్పుడై యీ మానవునికంటె శ్రేష్ఠు డన బరగి యుండెను.

మనుజు డట్లే ప్రేమానురాగబద్ధత్వమును పొందక ప్రాకృతమును క్రీగంటజూచుచు స్వస్వరూపసంధానము నొకప్పుడైనను జ్ఞప్తి మఱువక సంసార మనే గృహయజ్ఞమును నటించ నేర్చి వర్తించుచున్న యెడల విరాట్టు తానేగాని తనకు

వేఱుగా మఱియొక విరాట్టు లేక నేపోవును. గనుక శ్రీ బ్రహ్మాండ పిండాండ స్వరూపుల కభేదమేగాని వేరులే దని పండితవర్యులకు సానుభూతియై యుండును. ఇది సత్యము. సత్యము. కనుక సుజనులారా! మానవులు శ్రీ విరాట్పురుషుని అవయవములలో వేరువేరుగా జనించి ఇందు కొంద రొక కర్మిష్ఠులును కొందరు కానివారును లేరు. ఇక మానవ సృష్టిక్రమప్రమాణ మొకటి వినుడు.

శ్లో॥ మహర్షయస్సప్తపూర్వే, చత్వారో మనవ స్తథా
మద్భావామానసేజాతా, యేషాంలోకా ఇమాఃప్రజాః.
భగ. 10 అ. 6 శ్లో.

తా॥ భృగువు మొదలగు సప్తమహర్షులు వారికంటెను పూర్వులగు సనకాదులు, మనువులు, వీరందరును నా సంబంధ మగు భావముగలవారై నా సంకల్పమాత్రమున బుట్టిరి. లోకమునందలి యీ ప్రజ లందరును వారివలన బుట్టిరి. అని శ్రీకృష్ణపరమాత్మ స్వయముగా చెప్పియుండెను.

అందువలననే శ్రీ భాగవత ద్వితీయస్కంధ 81పుట 73 వ పద్యము మొదలు 86 పుట 92 వ పద్యము లోపల నారదునకు బ్రహ్మప్రపంచోత్పత్తిక్రమము జెప్పుటలో తాను స్వయముగా శ్రీ విరాట్పురుషునియందు గాంచినట్టి సృష్టిపరికరములగు మహదాదితత్వములగు ఆకాశాది పంచ మహాభూతములను సూర్యాదిఅధిదేవతలను శ్రీ విరాట్పురు

షుని అవయవస్థానములలో ఆయాతత్త్వాధిదేవతల జననస్థానము నిరూపించుటయందు సూర్యుడు నేత్రములయందు గలిగెను. చంద్రుడు మనస్సునందు బుట్టెను. శ్రోత్రములయందు దిక్కులు జనించెను. అని స్పష్టముగా నుడువుచు,

ఇకను కల్పనాకథరూపమైన మానవులయొక్క చాతుర్జాతులాదిగాగల విషయమును జెప్పవలసివచ్చినప్పుడు బ్రాహ్మణకులము ముఖమునందు గలిగె నందురు. బాహువులయందు క్షత్రియకులము జనించె నందురు. ఇట్లు తననుగాక లెక్క జూచుకొను మనునట్లు నుడివియుండెను. ఇక బ్రహ్మాండపురాణమునందు స్పష్టముగ ఆదియందు చతుర్ముఖబ్రహ్మచే మానవకోటి యొక్కజాతిగానే సృష్టింపంబడి అనంతరము త్రేతాయుగాదియందు పదిమంది పెద్దలగు మనుష్యు లొకచోజేరి కాలముననుసరించి తలయొక కృషులు నిర్ణయించుకొనునట్లుగ జెప్పుచున్నది. ఈ విషయము ముందువ్రాయుదును. చదువరులు సక్రమముగా గ్రహించునది.

కనుక యీ సాక్ష్యము లన్నియు మానవసృష్టినిగురించి సమష్టితత్త్వమునే వెల్లడించుచుండ ఒక్కరైనను అనగా శాస్త్రములు చదివినవారును చదువనివారునుగూడ యథార్థమగు జాతీయ నిజచట్టము మనసా తలపోసి సర్వభూతదయతో సర్వమానవులకు యథార్థమగు జ్ఞానతత్త్వమును బోధించక కులపక్ష, మతపక్షములు బూని దండూరదౌర్జన్యవాదభేద

ములతో బ్రాహ్మణులు ముఖమున బుట్టిరనియు, బాహువుల యందు రాజులు బుట్టిరనియు, యూరువులందు వైశ్యులు పుట్టి రనియు, పాదములందు శూద్రులు పుట్టిరనియు వీరలు భగ వంతుని సేవించుటకే పుట్టలేదనియు, వీర లేకర్మార్హులు గా రనియు తాము తలపోయుచు సమష్టితత్వ మనునది రవంత యైనను ఆత్మయందు తలపోయక ఆభాసభావనతో అన్యులను దూషణభూషణతిరస్కారంబు లాడెడివారు వేలకొలది కలరు. ఇట్టివారికి జ్ఞాత గలుగగలందులకే శ్రుతు లిట్లు శాసించు చున్నవి. ఏలననగా,

శ్రుతి:—జాతించ,నచర్మణో,నరక్తస్య,నామాంసస్య నచాస్థినః।
నజాతిరాత్మనోజాతి, ర్వ్యవహారపరికల్పితా.
—నిరాలంబోపనిషత్ 21 శ్లో.

తా॥ జాతి దేహమునకు లేదు. రక్తమునకు లేదు. మాంసమునకు లేదు. ఎముకకు లేదు. ఆత్మకు లేదు. జాతియ నునది లోకవ్యవహారము నిమిత్తము కల్పింపబడినది.

శ్రుతి:—అంత్యజాతి ద్విజాతిశ్చ, ఏకఏవ సహోదరా
ఏకయోని ప్రసూతత్వాత్, ఏకశాఖే నజాయతే.
—శరభోపనిషత్. 32 శ్లో.

తా॥ అంత్యజాతియందు బుట్టినను, అగ్రజాతియందు బుట్టినను వీరలిద్దరును సహోదరులే. ఏకశాఖవారే, ఎందు

వలననగా సర్వులును బ్రహ్మాత్మనుండియే సంభవమగుట వలన ననియే యెరుగునది.

శ్రుతి:—మూఢయితిచ దేహవర్ణాశ్రమకర్తృత్వభోక్తృత్వా ద్యహంకార భావనారూఢోమూఢః.

—నిరాలంబోపనిషత్. 35 శ్రు.

తా॥ మూఢుడనగా యెవడు? తనదేహము, తనజాతి, తనయాశ్రమము, తానే చేయువాడు, తానే అనుభవించువాడు అను నీ మొదలగు అహంకారరూపమగు వ్యష్టిభావనతో చరించువాడు మూఢుడనంబడును. (కనుక)

శ్లో॥ జంతూనాం ప్రాణినశ్శ్రేష్ఠా, ప్రాణీనా మతిజీవినాం,
బుద్ధిమత్సు నరాశ్శ్రేష్ఠా, నరేషు బ్రహ్మవాదినః.

—రాజయోగరత్నా.

తా॥ స్థావరములు మొదలగు జడవస్తువులలోపల ప్రాణములుగల జంతువులు శ్రేష్ఠములు. వాటికంటెను బుద్ధిచే జీవించు మనుష్య, మృగ, పశుపక్ష్యాదులు శ్రేష్ఠములు. వీటిలో మనుష్యులు శ్రేష్ఠులు. మనుష్యులలో బ్రహ్మజ్ఞానులు శ్రేష్ఠులు. గనుక నాసోదరీ సోదరులారా!

శ్లో:—ప్రాప్యచాప్యుత్తమంజన్మ, లబ్ధ్వాచేంద్రియసౌష్ఠవమ్।
నవేత్త్యాత్మహితం యస్తు, సభవే దాత్మఘాతుకః.

తా॥ ఉత్తమమగు మానవజన్మము దొరకియు, చక్షుశ్శ్రవణాదికర్మేంద్రియములు పుష్టిగా గలిగియు ఎవడు ఆత్మ

జ్ఞానము పొందుటకొఱకు ప్రయత్నించడో వాడాత్మఘాతకు డని చెప్పంబడును.

శ్లో:—ఏషాంనవిద్యా, నతపో నదానం,
జ్ఞానం నశీలం, నగుణో, నధర్మః,
తే మృత్యులోకే, భువిభారభూతో
మనుష్యరూపేణ మృగా శ్చరంతి.
—భర్తృహరి సుభాషితమ్.

తా॥ ఏమానవులు విద్యయు, తపస్సును, దానమును, జ్ఞానమును, శాంత శీలములను, సద్గుణములను, దానధర్మము లను చేయుట లేదో ఆనరులు యీ భూభారముగ చతుష్పా జ్జంతువులై చరించుచున్నవారలు అని యెరుంగుడు.

శ్లో॥ పురుషార్థత్రియీనిష్ఠాః, పురుషాఃపశవోధ్రువమ్,
మోక్షార్థీపురుషఃశ్రేష్ఠ, ఇతివేదాంతడిండిమః.
—వేదాంతడిండిమము.

తా॥ ధర్మార్థకామములను మూటినిమాత్రమే కోరు వారు పశుప్రాయు లనబడుదురు. మోక్షార్థియైన పురుషుడొ క్కడుమాత్రమే అందరికంటెను శ్రేష్ఠుడు. (కనుకసర్వులును)

శ్లో॥ అహింసాసత్యమ స్తేయం, శౌచమిన్ద్రియనిగ్రహః
దానందమోదయాశాంతి, స్సర్వేషాంధర్మసాధనమ్.
—యాజ్ఞవల్క్య స్మృతి.

తా॥ జీవహింస చేయకుండుటయు, అనగా యొరుల నెవ్వరినైనను మనస్సు కష్టింపజేయకుండుటయు, సత్యముగా పాడుకొనుచుండుటయును, దొంగతనము సేయకుండుటయు, మర్మబుద్ధి లేకుండుటయు, బాహ్యేంద్రియనిగ్రహముగలుగుటయు, ధర్మబుద్ధిగలిగియుండుటయు, అంతరింద్రియనిగ్రహము గలిగియుండుటయు, భూతదయ గలిగియుండుటయు, ఓర్పుగలిగియుండుటయు, సర్వజనులకు యిహపరసౌఖ్యసాధనభూతంబులైయుండును. (కనుక సుజనులారా)

శ్లో॥ అజ్ఞశ్చా శ్రద్ధదానశ్చ, సంశయాత్మావినశ్యతి.
నాయంలోకోఽస్తినపరో, నసుఖం, సంశయాత్మనః.
—భగ 4 అ. 40 శ్లో.

తా॥ ఆత్మజ్ఞానము లేనివాడును, సత్యమైన గురువాక్యములందును, యథార్థమైనభగవద్గీతాదిగ్రంథములయందును నమ్మకములేనివాడును సంశయచిత్తుడును నశించును. సంశయాత్మునకు యీలోకమందైనను, పరలోకమందైనను సౌఖ్యములేదు. కనుక సత్యసంధులైన భగవంతుని పుత్రులగు సర్వసుజనులారా! "ధైర్యం, సాహసం, లక్ష్మీః" అను న్యాయంబున యథార్థమైన ధైర్యసాహసములతో మీమీ పూర్వకృతము ననుసరించి మీకు బాల్యమునుండి ప్రాకృతరూపములైన అరువదినాలుగు విద్యలలో యేది లభించునో ఆవిద్యను సక్రమముగా కృషిసల్పుచు ద్రవ్య మార్జించి

యథార్థమార్గముతో భూతదయతో, అతిథిఅభ్యాగతుల పోషణతో, సత్యశౌచాదిగుణములతో, గృహస్థధర్మమున నటించుచు సర్వజనులును మీకు లోగడ కనుబఱచి నటువంటి భగవదనుశాసనమై వేదవాక్యము విధించు త్రివిధఋణవిముక్తి చేసికొని శ్రీమన్నారాయణుని దివ్య సన్నిధానము జేరుటకుగాను సదా శ్రద్ధాభక్తియుక్తులై యీలోకమున చరించుచు సజ్జనసమష్టిత్వబుద్ధిగలిగి దయా దాక్షిణ్యవర్తనగల ఏయొకజాతిమానవులైనను అట్టి సజ్జనుల సాంగత్యముచే సత్యాదివాక్యములను వినుచు సదా సత్యసమష్టిబోధించునట్టి సర్వవేదసారంబగు శ్రీభగవద్గీతలు: ఉపనిషత్తులాదిగాగల భాష్యములను సదా చదువుకొనుచు తదర్థమును సక్రమముగా గ్రహించి స్వానుభూతిని బొంది నిర్మలహృదయులై ధర్మబుద్ధిపరాయణులై వాదభేదములు లేక దుర్జనసాంగత్యము లేక శ్రీ సర్వేశ్వరుని కృపాకటాక్షములకు పాత్రులరై యిహపరసౌఖ్యసాధనభూతులరై శాశ్వతానందానుభవపరవశులరై సుఖించుడు; సుఖించుడు.

ఇది శ్రీమన్నారాయణ వరప్రసాదలబ్ధ కవితావిలాస పోకా వెంకటకృష్ణదాసప్రణీతంబైన జాతీయసమష్టిధర్మతత్వ రహస్య ద్వితీయాశ్వాసమునందలి బ్రహ్మజననంబును మానవుని విరాట్స్వరూపనిర్ణయంబును చాతుర్జాతుల జన్మస్థాన మభేదవిచారణ యనం బడు సర్వము సమాప్తము.

---

ఓమ్

శ్రీ గురుభ్యో నమః

# జాతీయసమష్టిధర్మతత్త్వరహస్యము

## తృతీయాశ్వాసము.

---

పురాణోక్తంబగు

## చతుర్ముఖ బ్రహ్మసృష్టిక్రమవిచారణ.

---

క॥ వె॥ అతఁడె బ్రహ్మ యనగ నలరి లోకంబుల
బుట్టజేసె వరుసబుట్టి రఖిల
జనులు త్రిగుణయుక్తులును నభిమానధ
నులును వఱలె వారివలన జగతి.

—బ్రహ్మాండపురాణము.

శ్లో॥ సాత్త్వికోదేవతాదేహో, మానవోరాజసస్స్మృతః
తమ స్తిర్యఙ్మృగాద్యాస్తు, దేహోయం పాంచభౌతికం.

తా॥ అనగా చతుర్ముఖబ్రహ్మచే పాంచభౌతికసృష్టి గుణవిభాగముల ననుసరించి మూడు విధములుగ సృజింపబడెను. ఎట్లనగా సాత్త్వికాంశమున దేవతలను రాజసాంశమున మనుష్యులను తామసాంశమున పశుపక్షిమృగ క్రిమికీటకాదులనున్ను సృజించెను. (అందుప్రథమమున)

చం॥ నలువ స్వకీయదివ్యవదనంబున దేవతలం, బితృవ్రజం
బులను నురస్థలంబున బ్రమోదము మీఱ మనుష్యులంసురా
రులజఘనస్థలంబునను రూఢిగ బుట్టగజేసి వింతయై
చెలగెడి సృష్టికాంక్షను సృజించెను న క్తము జ్యోత్స్న చేదగన్.

—బ్రహ్మాండపురాణము 1 అ. 195 ప.

తా॥ బ్రహ్మ (తన తపోమహిమవలనను దైవకరుణ
వలనను) తన ముఖమునుండి దేవతలను పితృదేవతలను,
వక్షస్థలమునుండి మనుష్యులను, యూరువులనుండి రాక్షసు
లను, చందురునినుండి చంద్రకిరణములు బయలువెడలినట్లుగా
తనఅవయవములనుండి వీరలను సృజించెను. (అప్పుడు.)

చ॥ పతగములున్, భుజంగములు, పాదచతుష్టయయుక్తజంతు
క్షితితలమందుబుట్టవటజెప్పెడిదేమి, మహీసురాదిసం [ప్రుల్
తతుల కభేదమే చెలగు ధర్మమొకండె నిరంతరంబు న
ప్రతిహతరూపమై ధరణి రాజిలు మానవు లేకజాతు లే.

—బ్రహ్మా. 1 అ. 79 ప.

తా॥ కీటకములు, సర్పములు, చతుష్పాజ్జంతువులు,
సృజింపబడలేదు. మానవులందరు ఒకే జాతివారు. సర్వులు
సత్యధర్మమును మాత్రమే యాచరించువారుగా నుందురు.
ఎట్లనగా,

ఆ॥ వె॥ అదియె కృతయుగాహ్వయంబున బొలుపారు
నందు బ్రబలియున్న యఖిలజనులు

చిత్తసిద్ధి గోరి చేయుచుందురు తపో
వ్రతములను పరేశభక్తు లగుచు.
—బ్రహ్మాండ 1 అ 71 పద్యం.

తా॥ ఆ కృతయుగమునం దున్నటువంటి సర్వజనులును దైవభక్తితో నిర్మలహృదయులై తపోధర్మవ్రతాదుల నాచరించుచుండువారలు. (అట్టికాలమందు)

చ॥ గిరిగుహలందు గుంజముల కేవలకాననసీమలందు సా
గరముల భూమిరంధ్రముల గాపురముం దనింజేయుచుండి లో
కరహితులౌచు భవ్యగుణకాండవిభూషితులై విగేహులై
పరగుదు రపు భూరిసుఖభాగులునై ముదమార నెప్పుడున్.

తా॥ మనుష్యులందరును గృహములు లేకయే, పొదరిండ్లయందు, అడవులయందు, సముద్రతీరములందు, భూమిరంధ్రములయందు, కాపురములు సేయుచుండువారలు. ఇట్లు ఆదియుగానుసారమైన ధర్మబుద్ధితో వర్తించుచు కందమూలాదులు, ఆకులు మాత్రమే ఆహారముగా గొనుచు వర్తించుచుండువారలు. ఇట్లుండ,

సీ॥ ప్రజలు నిరీహులై వర్తిల్లుచుండుట
జిత్తంబె విషయమై చెలగుచుండు
వార లొండొరుల నవార్య పౌరుషమున
హింసింపబూనక యెద్దియేని

కాయుగము ఒక్కగుణమే సర్వజనులయందు ఆరోహణమై యుండుటచే నాలుగుయుగములందునుగూడ ఆ యాగుణ సంబంధులకు మానవు లందరును ఒక్కజాతివారుగానే యున్న వార లని విజ్ఞులు తెలియుదురుగాక. ఇది యి ట్లుండనిండు. పై ప్రమాణము ననుసరించి యుగానుసారముగ ప్రజలయొక్క గుణము మారుచుండు నను వాక్యానుసరణిగా కృతయుగాంత మును త్రేతాయుగాదియును పొడసూపినంతనే ప్రజ లందరి యందును మనోద్రేకములైన విషయవాసనాలోలత్వము గలిగి యొండొరులకు కయ్యములు సంభవించి,

కం॥ ఆకస్మికముగ భూస్థలి
నీకరణిని సంగసక్తి హృదయంగమమై
వీక జెలంగుట మునుపటి
దా కాలప్రవృత్తి మారె నతిచిత్రముగన్.
—బ్రహ్మాండ. 1 అ. 96 ప.

కం॥ హితమతులను బోధించుటయు న
హితులం దెగటార్చుటయు మహీంభుజులకు నీ
క్షితికృత్యంబులు యుద్ధం
బతులంబగు సైన్యయుక్తి యర్థము లనుచున్.
—బ్రహ్మాండపురా. 1 అ. 97 ప.

తా॥ ఇట్లు యుగసంధికాలంబున మనుష్యులందరి యందును విషయవాసనాలోలత్వవైషమ్యములు పొడసూపి

నందున అప్పటికుండెడు జనములందుగల పెద్దలు ఒకచో జేరి యిట్లు నిర్ణయించుకొనిరి. ఈ ప్రజలకు కట్టుబాట్లు లేనట్లైన అన్యోన్యకలహములచే బలముగలవాడు దుర్బలుల బాధించు చుండును. కనుక ఈ ప్రజలయందు బలముగలవాని పరిపాల నాది కొన్ని సాంఘిక కట్టుబాట్లు నుండవలె నని తలంచిన వారలై

"త్రేతాయుగంబున ధరణి బుట్టి.
ధరణిసురుల్ మహీవిభు లుదారధనంబులుగ్రాలు వైశ్యులున్
జరణభవుల్ కిరాతు లను జాతులుగాగ జరించి రందు."

—బ్రహ్మాండ, అనుషంగ. 1అ. 138ప.

తా॥ అప్పటికున్న ప్రజలలో కొంచెము తెలివియు, జాగ్రతయు, శమదమంబులు కలవారిని కొన్నిగ్రంథములు రచించుటకును ప్రజలకు ప్రజ్ఞానాది ధర్మములను బోధించు టకును నిర్ణయించిరి. మఱికొందరు బలశౌర్యసాహసములు గలవారిని గ్రామపరిపాలకులుగను నిర్ణయించిరి. ఇంకకొందరు లౌకిక వ్యావృత్తిగలవారిని ఒకచోట వస్తువు, మఱియొక చోటునకువ్యాపారరూపముగ మార్చుటకు విధించిరి. ఇక మిగి లిన ప్రజలు ఆమువ్వురికార్యములయందు సహాయభూతులై యుండులాగున నిర్ణయించిరి.

ఇట్టి సంఘము లేర్పడినప్పటినుండియు ఈ పరిపాలకు లకు మొదటి సంఘముయొక్క శాఖవారే మంత్రాలోచన

జెప్పుటకును, లా చట్టమగు గ్రంథములు నిర్ణయించుటకును సంబంధమై యుండెను. అందువలన యీమంత్రుల యిష్ట ప్రకారము గ్రామమునకు ప్రభువుగా నున్నవాడు ప్రజల యందు కట్టుబాట్లు నడపుట సంభవించెను. అందువలన యిప్పటికీ మన ఆంగ్లేయులు ఏ సంవత్సరమున కాసంవత్సరము నూతన లా చట్టములు శారదాబిల్లువలె అమలులో బెట్టుచు ఆ చట్టప్రకారము ప్రస్తుతకాలపు ప్రజలను నడిపించు చున్నట్లే పూర్వమును క్రమేణ బ్రహ్మ, క్షత్రివంశీయు లను రెండుతెగలవారు యేకీభవించి స్మృతు లనే, లా చట్టము లను వ్రాసి చూపించుచు మిగిలిన ప్రజలను ఆ లా చట్ట ప్రకారము కార్యకారణసందర్భములయందు భయభీతులతో దాస్యమును చేయించుకొనుచు వచ్చుచుండిరి. కాని తదుపరి,

తపోమాహాత్మ్యములు గలిగిన కశ్యప ప్రజాపతికి దితి యను భార్యయందు లోకకంటకులైన హిరణ్యాక్షహిర ణ్యకశిపు లను వాండ్లు జనించినట్లు బ్రహ్మక్షత్రియులలో కాలానుగుణ్యముగా అనేకులు ధూర్తులుగూడ జనించియుండ వచ్చును. మఱియు అట్టి రాక్షసుడైన హిరణ్యకశిపునకు సత్య సంధుడై దేవతానీకస్తుత్యుడైన ప్రహ్లాదుడు జనించినట్లు మూడు, నాలుగు సంఘములలో అనగా వైశ్యశూద్రు లను వారిలో శాంత శమదమాది దైవభక్తి, గురుభక్తి భూతదయ గలవార లనేకులు జనించి యుండవచ్చును. అట్లు జనించినప్పు

టికిని ఇప్పుడు మనదేశములో రైళ్లు మొదలగు ననేకయంత్ర ములు గనిపెట్ట గలిగినట్టి తెలివిగలవార లెందరో గలరు. కాని యిప్పుడు రాజ్యపరిపాలకులైన ఆంగ్లేయులు, మనవాండ్ల తెలివి బయలు పఱచినయెడల శిక్షించుట కారంభించినందున హిందువుల తెలివియంతయు, నుసిగప్పిన నిప్పువలె ఎట్లు నిష్ప్రయోజనముగా దోచుచున్నదో అట్లే పూర్వమును బ్రహ్మక్షత్రియుల పరిపాలనాచట్టముక్రింద తాళలేక ప్రజ్ఞానులైనను ప్రాకృత తెలివిగలవారలైనను తదన్యులు పై వారికి అల్పమైన సేవలుజేసి బ్రదుకుచు వచ్చుచుండిరి. ఇట్లు న్న కాలమున మానవులకు పూర్వము గృహములు లేవు గనుక.

తే॥ గీ॥ మఱియు త్రేతాముఖంబున మానవగణ
మెలమి నాయామవిష్కంభముల గృహాంత
రములు నిర్మించుకొనియె నర్హమగు జ్ఞాన
మున స్వకీయాంగుళవ్రాతమున నె కొలిచి.

—బ్రహ్మాండ. 1 అ. 110 ప.

తా॥ అట్టి త్రేతాయుగమందు ప్రజలు వారి వారి తెలివితేటలకొలంది అంగుళప్రమాణముతో కొలిచి గృహ ములను, గ్రామములను నిర్మించుకొనుచు వచ్చుచుండిరి.

—* బ్రహ్మసృష్టి.- ద్వితీయవిచారణ *—

ఇట్లున్నకాలమున ప్రజావృద్ధి తక్కువగా నుండుటం జూచి చతుర్ముఖబ్రహ్మ తన శరీరమునుండి దేవతాగణమును

సృజించి, ఆశరీరమును వదలి మఱియొక శరీరమును దాల్చి ఈ శరీరమునుండి పితృగణము గలిగించి ఆశరీరము వదలి మఱి యొక శరీరముదాల్చి యీ శరీరము నుండి మానవగణము సృజించి యిట్లే ఒక్కొక్కశరీరమున కొక్కొక్క భూత గణము చొప్పున,

సీ॥ బ్రహ్మచే సృజియింపబడిన నిర్జరపితృ
మునిమానవాదిక భూతజాల
మాత్మస్వరూపంబులను భూతములజరా
చరముల యక్షపిశాచ గుహ్య
కాప్సరఃకిన్నరాద్యమరయోనులమఱి
పక్షి మృగోరగపశువితతిని
సృజియించె జగమున జెలగు స్థావరజంగ
మాత్మకసృష్టి యవ్యయము వ్యయము
... ... ... ...

—బ్రహ్మాండ. ప్రక్రియ. 1 అ. 198.

ఇట్లు బ్రహ్మ ఒక్కొక్కశరీరమున నొక్కొక్క గణము సృజించుచు క్రమేణ సర్వలోకములయందు నున్నట్టు వంటి భూతగణమునంతయు తన శరీరమునుండియే సృజించెను. ఇట్టి ద్వితీయసృష్టియందు,

కం॥ ఎనుబది యెనిమిదివేలని
మునిసంఖ్య చెలంగు వారి ముఖములవలనన్

ఘనసంహితలన్నియు ప్రబ
లెను భూస్థలి నవియె మహితలీలం దనరుౘ.

—బ్రహ్మాం. అనుషంగ-3అ. 638 ప.

ఇట్లు ద్వితీయసృష్టియందు ఎనుబది యెనిమిదివేలు ఋషులు జనించిరనియు వారందరును అనేకభాష్యములు వ్రాసియున్నా రనియు తెలియవచ్చుచున్నది.

ఇందువలననే లోకమందు బహుమతములు బహుజాతులు బహునిష్ఠవ్రతములు బహుకథాభేదసందర్భములుగా హిందూమతమునందు చతుర్వేదములును వాటికి నాలుగు ఉపవేదములును 6 వేదాంగములును 1184 ఉపనిషత్తులును 40,00,00 జ్యోతిషమును 84 శాస్త్రములును 32 పురాణములును కల్పింపబడుచు, యిందుండి 75 మతములును ఒక్కొక్క మతమునకు ఆయాకర్మానుకూలమతసంబంధమైన శాస్త్రములును అందులో ఒక్కొక్క మతమునకు అనేక శాఖలు గలిగి ఒక శాఖవారు మఱియొకశాఖవారితో నామతము మంచిది, నాశాఖమంచిది, నాకులము మంచిది, అని వాదించుకొనుచు కొట్లాటలు సంభవించియుండెను. కనుక ఈ పైనజెప్పిన వాటిలో ఏది వేదమో, ఏది అవేదమో, ఏది ఆర్షేయమో, ఏది పౌరుషేయమో వర్ణించి చెప్పుటకు బ్రహ్మకైన సాధ్యము కా దని శాస్త్రములు బలుకుచుండ

యిక మానవకోటిశాస్త్రజ్ఞాన మెంత యని నిరూపింప వలయును? విజ్ఞులు ఎరుగునది.

—* బ్రహ్మదేవుని తృతీయసృష్టివిచారణాక్రమము *—

ఈ పైన జెప్పినట్లుగా త్రేతాయుగమున ఇప్పటికి గలిగియున్నటువంటి ప్రజలు స్వజాతీయ, విజాతీయ భేదములతోను, స్వాభిమానధర్మములతోను, దైవభక్తి గురుభక్తి తోను వంశపరంపరా వచ్చుచున్నవారలుగాని అంతగా జన వృద్ధి లేకపోయెను. అందులకు చతుర్ముఖబ్రహ్మ సృష్టివృద్ధి లేమికి జింతించి ఇకమీఁద యోనిసంభవముగా న[illegible]య మునుండి ప్రతిభూతమునకు సంతతి అధికముగా గలుగుచుండు నట్లు సృష్టిజేయ సంకల్పించి ప్రథమమున

శ్లో॥ ద్విధాకృత్వా మనోదేహ మర్ధేన పురుషోభవత్
అర్ధేన నారీ తస్యాం స విరాజ మసృజ త్ప్రభుః.
—రాజయోగ. 32 శ్లో.

తా॥ ఆబ్రహ్మ తన శరీరమును రెండుభాగము లగు నట్లుగా జేసి కుడిభాగము మర్దించగా అందు పురుషుఁడు జన్మిం చెను. మఱల ఎడమభాగము మర్దించగా స్త్రీ జన్మించెను. ఇందు జన్మించిన పురుషుఁడే స్వాయంభువు మనువనియును, విరాట్ అనియును చెప్పంబడును. ఈ స్త్రీయే ఈమనువు యొక్క భార్యయగు శతరూపి యని చెప్పంబడును. అంతనుండి బ్రహ్మ మరల,

శ్లో॥ బ్రాహ్మణాస్తుమరీచ్యాద్యాః, నవద్యాః, సాధకాస్స్మృతాః
తతో దేవాసురపితౄన్, మనుష్యా నసృజత్ప్రభుః.
—రాజ. 30 శ్లో.

తా॥ ఆబ్రహ్మ మరల తన దేహమునుండి తొమ్మండు గుర నవబ్రహ్మలనుసృష్టిసాధకు లనుగ సృజించెను. వారి వలన అనంతరము దేవతలను, రాక్షసులను, పితృదేవతలను మనుష్యులను సృజించెను. ఆ నవబ్రహ్మలయొక్క నామము లను వినుడు.

శ్లో॥ మరీచిమత్ర్యఙ్గిరసం, పులస్త్యపులఃక్రతూన్
దక్షకశ్యపభృగ్వాదీన్, ఋషీ నగ్రే సృజత్ప్రభుః.
—రాజ. 31 శ్లో.

తా॥ అత్రి, అంగీరస, పులస్త్య, పులః, క్రతు, దక్ష, కశ్యప, భృగు, మరీచి యను నవబ్రహ్మలను సృజించెను.

చ॥ మునుసృజియించినట్టిభృగుముఖ్యులు కేవలమానులంచుమీ
మనముల నెంచబోకు డభిమానము గల్గు గృహస్థులయ్యుస
న్మును లని బ్రహ్మమానసతనూజులునం చననొప్పియుండిరా
ఘనమతు లెల్లలోకముల గల్పనసేయ సమర్థులై రొగిన్.
—బ్రహ్మాండ. ప్రక్రియ. 1 అ. 192 వ.

ఇట్లు బ్రహ్మ తన కుడిభుజమునుండి స్వాయంభువమను వును, ఎడభుజమునుండి నాతని భార్యయగు శతరూపియను స్త్రీనిన్ని సృజించి వారిరువురను ప్రథమ గృహస్థులనుగా

జేసెను. అంత యీ మనువునకు ముగ్గురు కొమార్తెలును యిద్దరుకొమాళ్లును గలిగిరి. అపు డీస్వాయంభువ మనువు తన కొమార్తెల మువ్వురను ఆపైన జెప్పినట్టి బ్రహ్మప్రజాపతులైన మరీచ్యాదినవబ్రహ్మలలో,

ఆ॥ వె॥ దక్షునకు బ్రసూతిదారగా నిచ్చె స్వా
యంభవుండు రుచికి నంతనిచ్చె
కూర్మినలరుచున్న కూతు నాకూతిని
వారివలన సృష్టి వఱలె జగతి.

— బ్రహ్మాండ. అనుషంగ. 1 అ. 255 ప

సీ॥ ఘనుడౌమరీచికి గర్దమాత్మజయగు
గళయను నంగనవలన గశ్య
పుండను కొడుకును బూర్ణిమయను నాడు
బిడ్డయు బుట్టిరి పేర్చి వారి
వలనబుట్టిన ప్రజావళి పరంపరలచే
భువనంబులెల్ల నాపూర్ణమగుచు
జరిగె ... ... ... ...

— భాగ. చతుర్థాశ్వాసము. 9 వ ప

తా॥ అనగా మనువుకొమార్తెలు మువ్వరిలో ప్రథమ పుత్రికయగు ప్రసూతియను కన్యకను దక్షప్రజాపతికిని యాకూతియను కన్యకను రుచిప్రజాపతికిని, దేవహూతియను కన్యకను కర్దమప్రజాపతికిని యిచ్చి స్వాయంభువ మనువు

వివాహము చేయగా వారి మువ్వురవలన గలిగినసంతతియే సర్వలోకము లాక్రమించెను. ఇట్లున్నకాలమున యీజనపరంపరలోనే దక్షప్రజాపతి మఱల మఱియొక స్నిగ్ధయను కన్యకను వివాహమాడగా ఆస్నిగ్ధయందు దక్షునకు,

తే॥ గీ॥ ప్రబలి రంతట దక్షుండు భార్యయందు
గాంచె నిరువదినల్వుర కన్యకలను
లోకమాతల పంకజలోచనలను
షడ్గుణైశ్వర్యమహితల సాధుమతుల.

—బ్రహ్మాండ. 1 అ. 227 ప.

ఇరువదినలువురు కొమార్తెలు గలిగినటువంటి వారలైరి. అందులో యీదిగువ నుదహరించు పేరులుగల పదిమంది కన్యకలను నవబ్రహ్మలలో కశ్యపప్రజాపతికి యిచ్చి దక్షుండు వివాహము జేసెను. కశ్యపునిగురించి భాగవత 6 అధ్యాయము.

సీ॥ కామితప్రదుడైన కశ్యపు కౌగిట
ముచ్చట దీర్త రేముద్దరాండ్రు

అని హెచ్చరించి వారిపేరులు జెప్పుచున్నారు.

తరల॥ అదితియుఙ్, దితి, కాష్ఠయుఙ్, దనువయ్యరిష్టయు దామ్రయున్నదనగ్రోధ, దశాఖ్యయుఙ్, సురసాఖ్యయుఙ్, సురభిన్ము

నిక్ మొదలుగాదిమియున్నిలాఖ్య, సుముఖ్య యాసరమా
గా ముదిత లెన్నగ గన్నసంతతి ముజ్జగంబులు భూవరా.
—భాగవత, 6 అ. 256 ప

ఈ పైపేరులు గలిగినటువంటి దక్షుని కొమార్తె
కశ్యపప్రజాపతి వివాహమాడగా ఇందులో దితికి రాక్ష
సులును, అదితికి దేవతలు, ద్వాదశాదిత్యులు, వారివలన వైవ
స్వతాది మనువులు, మనువులవలన మానవులును క్రమముగా
గలిగిరి. మిగిలిన భార్యలయందు కాశ్యపునకు,

శ్లో॥ జరాయుజోఽండజశ్చైవ, స్వేదజశ్చోద్భిజ స్తథా
ఏవంచతుర్విధః ప్రోక్తో, దేహోఽయం పాంచభౌతికం.

తా॥ పాంచభౌతికశరీరములు, జరాయుజములనియు
అండజములనియు, స్వేదజములనియు, ఉద్భిజ్జములనియు
నాలుగు విధములుగా నున్నవి. అందుపై సృష్టినంతయు
కశ్యపుని సంతతిగానే భాష్యములు చెప్పుచున్నవి. కనుక
సర్వసుజనులారా!

"తస్మాదాహుస్సర్వాః ప్రజాః కాశ్యప్యః"
—శతపదశ్రుతి.

అనగా సర్వప్రజలు కాశ్యపు లనబడుదురనియు,
"గోత్రినాశేతు కాశ్యపః"
—హేమాద్రిలో నుదాహరించిన వ్యాఘ్రపాదవచనము.

అనగా గోత్ర మెరుగనిచో కాశ్యపగోత్రము నుచ్చ రించవలెనని యుండుటచే సర్వప్రజలును కాశ్యపున కన్య ముగా జనించినట్టి అన్యశాఖవారొక్కరును లేరని స్పష్టము.

అయితే యీఋషిసాంప్రదాయకము లన్నియు మాది విశ్వామిత్రఋషి యనియు, మాది వశిష్ఠఋషి యనియు, బేర్కొనబడినట్టి శాఖ లెట్లు గలిగెననగా నారదు డాదిగాగల మహర్షులందరును వారివారి విద్యాబలముకొలంది వేదము నకు శాఖలు గల్పించి యీ ప్రజలలో వారివారికి దగినట్లు కొందరిని శిష్యులుగా యేర్పాటుచేసుకొని వారు నిర్మించిన వేదశాఖలను శిష్యులచే పఠింపంజేసి మీరు నా సాంప్రదాయ కులు, మీరు నా సాంప్రదాయకు లని ఆ యా ఋషులు బోధించినందువలన వారివారి గురుసాంప్రదాయకఋషు లే యిప్పు డీ ప్రజలచే బేర్కొనబడుచుండిరి. ఎట్లనగా లగ్న కోటికి జన్మనక్షత్రము మరచినపుడు నామనక్షత్రమే ప్రధాన మైనట్లుగా యిప్పు డీ భేదఋషిసాంప్రదాయకులు తమ జన్మస్థానమైనట్టి కశ్యపఋషిని మఱచి అన్యఋషులను బేర్కొనుచున్నారు. మిగిలిన సర్వజనులును కశ్యపఋషి సాంప్రదాయకులుగనే యున్నారు. కనుక క్రియ కన్నిజాతుల వారును మనువుసంబంధు లగుటచేత మానవు లనియును, కశ్యపఋషిసాంప్రదాయకు లగుటచేత కాశ్యపులనియును స్మృతి సిద్ధమై యున్నది.

—* సంకరజాతి విభాగ వివరణము *—

స్మృతి:—ఉక్తో నియోగో మనునా నిషిద్ధ స్స్వయమేవతు
యుగహ్రాసాదశక్యోయం, కర్తుంమన్యైర్విధానతః.
—బృహస్పతి వచనము.

అనగా స్వాయంభువ మనువుచే మర్త్యలోకమునందు గల కొన్ని ధర్మములు యుగానుసారముగా స్థాపింపబడెను. అనుప్రమాణము ననుసరించి,

ఈమనువుచే పూర్వము విధించబడియున్నటువంటి మానవులయందు చాతుర్జాతుల విభాగమునకు అనేకజాతులుగ ప్రజలను వర్తింపజేయుటకుగాను మనుస్మృతి యనుకర్మ చట్టము బోధించు గ్రంథ మొకటి స్వయముగా నిర్మించి ఆ కర్మచట్టముప్రకారము తాను ప్రభువగుటచే ప్రజలను కట్టుబాట్లతో అనేకజాతులుగ మార్చెను. ఆచట్టము ననుసరించి ఋషులనుగూడ అట్టి కాలమునుండి క్రమేణ యెవరి బుద్ధి విద్యాబలముకొలంది వారు ఒకదాని కొకటి విరుద్ధముగా కలహములు గలిగించునట్లు అనేక స్మృతులను వ్రాసిరి. అట్లుండు కాలమున మనువుచే నిర్ణయించబడిన సంకరజాతుల జన్మస్థానవివరణను గురించి సూచనకొరకు కొన్ని స్మృతి వాక్యములు మాత్రము యిచట పొందుపరచెదను గమనించుడు.

"విప్రాన్మూర్ధావసిక్తోహి, క్షత్రియాయాంవిశఃస్త్రియాం
అంబష్ఠశ్శూద్రాం, నిషాదోజాతః పారశవోపివా
వైశ్యాశూద్రోస్తు,రాజన్యాన్మాహిష్యోగ్రౌసుతౌస్మృతౌ
వైశ్యాత్తుకరణశ్శూద్రాం, విన్నాస్వేషవిధిస్స్మృతః
—యాజ్ఞవల్క్యవచనము.

అనగా వ్యభిచారమువలన విప్రునకు క్షత్రియ వైశ్యస్త్రీలయందు బుట్టినవాడు క్రముముగా మూర్ధావసిక్తుడు, అంబష్ఠుడు ననంబడుదురు. శూద్రస్త్రీయందు బుట్టినవాడు బోయవా డనిగాని, పారశవు డనిగాని యనబడును. అట్లే క్షత్రియునికి వైశ్య శూద్రస్త్రీలయందు బుట్టినవారు క్రమముగా, మాహిష్యుడు, ఉగ్రుడు అనబడుదురు. పైవలెనే వైశ్యునకు శూద్రస్త్రీయందు బుట్టినవాడు కరణుడనబడును. అట్టి మూర్ధావసిక్తుడు, అంబష్ఠుడు, నిషాదుడు, మాహిష్యుడు, ఉగ్రుడు, కరణుడు అనబడు నార్గురును, అనులోమజు లనబడుదురు. (ఇట్లే ఎగువజాతి స్త్రీలయందు దిగువ పురుషులకు గలిగినట్టివారు ప్రతిలోమజు లనబడుదురు. ఇప్పుడీపైన వక్కాణించిన ఆరుజాతులవారికి జీవనవృత్తులు స్మృతికౌముదిలో వసిష్ఠవచనము,

ఇందు మూర్ధావసిక్తులకు, ఏనుగులకు, గుఱ్ఱములకు తగిన శిక్షతో విద్యనేర్చి రథసారథులుగా నుండుటయును, శస్త్రశిక్షలు బొందుటయును వృత్తులు.

అంబష్ఠులకు శస్త్రధారణమును, మణి మంత్రౌషధ వైద్యముచే జీవించుటయును మాహిష్యులకు గీత, నృత్య, నాట్యములు సేయుట జీవనవృత్తు లగును.

పారశవ, ఉగ్రక్షత్తలకు ద్విజశుశ్రూషయు, రాజ సేవయు, అంతఃపురములకు ధనాగారములకు ద్వారపాలకు లుగా నుండుటయు, రథశాలకు నిధిజ్ఞానమును, హస్తి, అశ్వముల సారథ్యము, పెంచుటయు శిక్షజెప్పుటయు వృత్తు లగును. ఇట్లే,

శ్లో॥ విప్రాయాంయస్సుతః క్షత్రాత్సూతా గజబంధకృత్
దమనం, తురగాణాంచ, కుర్యా త్తజ్జీవనం పరం.

—విశ్వంభరశాస్త్రము.

తా॥ క్షత్రియుడు మోహించిన బ్రాహ్మణకన్యయందు బుట్టినటువంటివాడు సూతు డనబడును. వీనికి వృత్తులు గజ ములకు, నశ్వములకు, శిక్షనేర్పుట యగును.

శ్లో॥ బ్రాహ్మణ్యాంతుసుతోజాతో, వైశ్యాద్వైదేహకస్స్మృతః,
పాషాణకాష్ఠయో శ్శిల్పం, తస్య జీవన ముత్తమం.

—విశ్వంభరశాస్త్రము.

తా॥ అనగా బ్రాహ్మణస్త్రీయందు, వైశ్యునకు బుట్టి నవాడు వైదేహకు డనబడును. వీనికి, రాళ్లు, కర్రలు, చెక్కి జీవించుట వృత్తు లనబడును.

శ్లో॥ యస్తుప్రవ్రజితాజ్జాతో, బ్రాహ్మణ్యాం యశ్చశూద్రజః
తా వుభౌ విద్ధి చండాలౌ, సగోత్రాద్యశ్చ జాయతే.
—మేధాతిథి వ్యాఖ్యానమందు ఆంగీరస వచనము.

శ్లో॥ చండాలశ్వపచానాంతు, నిర్గ్రామస్యా త్ప్రతిశ్రయః
అవపాత్రాశ్చ కర్తవ్యాః, ధన మేషాం శ్వగర్దభం.

తా॥ అనగా సన్యాసికిని, శూద్రునకును విప్రస్త్రీ యందు బుట్టినటువంటివాడును, స్వగోత్రస్త్రీయందు బుట్టినటువంటివాడును పంచము లనబడుదురు. వీండ్లకు జీవన వృత్తులు గ్రామమునకు వెలిగానుండుటయు, కుక్కలను, గాడిదలను, పెంచి జీవించుటయు, పెంకులలో భోజనము సేయుటయు.

ఇట్లనేకవిధముల మనువుచే నిర్ణయింపబడిన సంకర జాతుల విషయమును గుఱించి తత్సంబంధముగా వ్రాసిన ఋషిప్రోక్తములగు స్మృతులను చూడగా జాతిభేదమునకు తారతమ్యమే కనుపించలేదు. ఇట్లు జాతివివేకమునందు మాత్రము.

శ్లో॥ అనులోమ్యేన వర్ణానాం, షణ్ణారా స్సంప్రకీర్తితాః
ప్రాతిలోమ్యేన తేషట్ స్యు రితిద్వాదశభేదతః
ఏతేద్వాదశమిశ్రాస్తు, చత్వారింశ ద్విమిశ్రితాః
అష్టౌచయేస్యుర్భేదా స్తే, షష్టిర్ద్వాదశసంయుతాః

హాతా స్తేష షష్టిసంఖ్యా త్రైష్టట్ త్రింశ
భేదాస్సంకరజాతీనాం, బహవస్సు
తా॥ అనగా బ్రహ్మ, క్షత్రి, వైశ్య
లార్గురు, క్షత్రి, వైశ్య, శూద్రులకు
వీరు వెరశి పండ్రెండుగురు. వీరు పరి
జాతులస్త్రీలయందు నలుగురేసి పుత్రుల
నలువదియెనిమిది భేదములగును. తండ్రుల
గలిసి 60 అరువది భేదములు. ఈ అరువది భేద
ముచే నొక్కొక్కటి యరువదియైన-చో 360
ఆరువందల భేదములగును. అటుపైన బహు
అని యిట్లు అనేకవిధములైన జాతిభేదములు
స్మృతిచట్టములు దొరదలచుకొనిన దెబ్బలకు
నట్లు యీమనువాదులచే కల్పింపబడినట్లు యున
సుఖ మేమియు కనుపించదు. ఎందువల్లననగా,

భువిలోబుట్టినప్రతియొకమానవుడును వై
సహజముగా బాల్యమునుండి విద్య నేర్చుకొనుట
తరము వైవాహికమును పొంది గృహస్థుగా
అంతనుండి దంపతులిరువురును ప్రాతః కాలమున
గ్యశుచిర్భూతమునకు స్నానమాచరించి వైవా
నుటయు యొరులను హింసించని మార్గకృషి చే
ర్జించుకొనుటయు అతిథి, అభ్యాగతులను పోషిం

వంత్రులను శ్రద్ధాభక్తులతో పూజించుచు వారి యాజ్ఞలకు బద్ధు లైయుండుటయు ఆదంపతులిరువురు జారచోరత్వ మమతాహం కారములు దంభయీర్ష్యాదులు లేక శాంతిశమదమాదులతో వర్తించుచు బుధజనసాంగత్యంబున సత్యసమష్టిధర్మశాస్త్ర ములు శ్రవణమననాదులు జేయుచు సద్గుణసదాచారసంప న్నత్వ దైవభక్తి, గురుభక్తి, ఆత్మరతి, వైరాగ్యములుగల ఒక సద్గురువు నాశ్రయించి తాము యీలోకమునకు వచ్చినకారణ మును తాము చేయవలసిన విధానమును బ్రహ్మతత్వస్వరూప నిర్ణయమును ఆసద్గురువువలన నీదంపతులిద్దరును దెలిసికొని స్వానుభూతిని బొందెడి మార్గమే సర్వజనసర్వమతసర్వవేద సమ్మతివిధానంబై యుండగా యీ కల్పితకర్మస్మృతిచట్టములు ఎందుకు జనించెనో తెలియకున్నది. ఇందులకు వేమన్న ఒక పద్యమునం దిట్లు నుడివియున్నాడు.

కం. ఓంకారము సర్వమునై
ఝుంకారము సేయుచుండ జగములనెల్లన్
మంకుతనంబున జాతులు
రంకుల కల్పితము మూఢరాసులు వేమా.

గనుక సుజనులారా! అనాది స్వాయంభువమనువునుండి జాతీయచట్టమును కర్మకాండచట్టమును, నిరూపించి నటు వంటి విషయము ననుసరించియే ఋషులెల్లరును అనేకవిధము లైనటువంటి స్మృతిచట్టములను యేర్పాటుచేయుటయు తత్సం

బంధముగా జాతులు వగైరా కట్టుబాట్లతో మనువుదగ్గర నుండియు, పరిపాలకులవలన కొంతకాలము కొన్నిచట్టములు వర్తించుచుండుటయు, కొంతకాలమునకు కొన్నిచట్టములు సహగమనమునకువలె (అనగా పూర్వము భర్త మరణించగానే ఆతని భార్యనుగూడ దహనముచేయుదురు. ఆచట్టమును 150 సంవత్సరముల క్రిందట ఒక మహాపురుషుడు బుట్టి మార్చివేసెను. అట్లే) స్మార్తమతమునందు యీఋషిసాంప్రదాయకమైన అతికర్మచట్టమును మార్పుజేసి—రామానుజుడు దైవభక్తియే ప్రధానముగాగల వైష్ణవమతమును స్థాపించెను. ఇట్లే శ్రీశంకరులు సామాన్యకర్మనంతయు నివృత్తి ప్రతిహతముసేయుచు ఆత్మతత్త్వమును బోధించెను.—కనుక యీ కర్మకాండస్మృతిచట్టములు ఒక మహాఋషి కాలములో పుట్టుటయు, మఱియొక ఋషికాలములో ఆచట్టము మారి మఱియొక కర్మజ్ఞానమార్గములు బోధించుచట్టములుగ మార్పు గలుగుచుండుటయు నైజము. కనుక యీస్మృతిచట్టములు శాశ్వతములు కావనియును, శ్రీ భగవద్గీతానుభవము మాత్రమే శాశ్వతసంబోధనాత్మదర్శనమార్గమనియును, ప్రతియొకరును శ్రద్ధాభక్తి నమ్మకములతో శ్రీ భగవద్గీతలను బఠించి తదర్థము స్వానుభూతిని బొంది నివృత్తిమార్గమున నిత్యానందానుభవులై యిహపరసౌఖ్యంబు లనుభవింతురుగాక.

సనాతనపరబ్రహ్మసృష్టియొక్కయు, చాతుర్జాతుల విభాగముయొక్కయు, సంకరజాతిభేదవిభాగముయొక్కయు విచారణ యిట్లున్నది. ఇక ప్రస్తుతము హిందూదేశ మనం బడు ఆర్యావర్తముయొక్క నివాసులగు ప్రజలయొక్క తత్త్వవిభాగవిషయమును, వినుడు. హైందవప్రజాచరిత్రి సంగ్రహామువలన తెలియవచ్చెడిని.

పూర్వము హిందూదేశము నెక్కడ జూచినను అడవు లే యుండెడివి. ఆ కాలమున పట్టణములు, గ్రామములు మొచ టను లేవు. కాని అడవిమనుష్యు లనువారు కొందరుమాత్రి ము అక్కడక్కడ నుండుచు పండ్లు, దుంపలు, పచ్చిమాంస ము ఆహారముగా భుజించుటయు తాము చంపిన మృగముల యొక్క చర్మమునే వస్త్రముగా ధరించుటయు గలిగియుం దురు.

తదనంతరము కొంతకాలమునకు ద్రావిడులనువారు వాయువ్యమూలనుండి బెలూచిస్థానము మీదుగా మనదేశ ములో ప్రవేశించి వారికి వీలైనంతవరకు ఈ అడవులను గొట్టు టయు కొన్నికొన్ని కుగ్రామముల నిర్మించుకొనుటయు జేయుచు వ్యవసాయముచేసి పంటలు పండించుకొనుటయు, భోజనపదార్థములు ఆహారముగా నుపయోగించుకొనుటయు గలిగియుండెడివారు. ముఖ్యముగా గోవుల బెంచుచు వాటి క్షీరాజ్యాదులచేత లాభసంతుష్టి బొందుచుండెడివారు. వీరు

గోచీలను మాత్రిమే ధరించువారు. ఇట్లున్న కాలమున యీ దేశమునకు—

ఆర్యులనువారు ఐరోపాఖండములోని హంగేరి, పోలెండు, విధులేని యీ ప్రాంతములనుండి కైబరుకనుమద్వారా మన దేశములో ప్రవేశించిరి. వీరు సంస్కృతభాషను మాట్లాడు చుండిరి. వీరు మనదేశమునకు రాకపూర్వము వారున్నస్థల ములయందు వ్యవసాయముచే గోధుమలను పండించుకొను టయు, పశువులను బలపరుచుటయు, నూలు వడకి వస్త్రం బులు నేయుచుండెడివారు. వీరు మనదేశములో మొట్ట మొదట సింధునదీప్రాంతమున ప్రవేశించి క్రమేణ వృద్ధి బొందినకొలంది అప్పటికుండెడు ద్రావిడులను యుద్ధసన్నా హములచేత దక్షిణదిక్కునకు వెళ్ళగొట్టి యీదేశము క్రమేణ ఆర్యులే ఆక్రమించుకొనినట్లు ఋగ్వేదము జెప్పుచున్నది. (ఆర్యులనగా యీద్విజులే యని యెరుగునది.)

ఆర్యులవృత్తులు:—ఆర్యులు పశువుల మేపుటయు, వ్యవసాయు చేయుటయు మోటబావులచే నీటిని పారించి పంటలు పండించుటయు. వీరికి బాగుగా తెలియును. వీరికి వేటాడుటయందు మిక్కిలి ప్రీతి. వీరు యుద్ధాదులయందు రాచకార్యములు జరుపుటకు ధైర్యసాహసములుగలవారు. బట్టలునేసి రంగులు వేయుటయందును, కోటలు నిర్మించుట యందును, లోహముయొక్క ఉపయోగకరములగు పనుల

యందును జ్యోతిషమునందును, ఆధ్యాత్మికవిద్యయందును, వ్యాకరణశాస్త్రమునందును, రేఖాగణితమునందును, సంగీత మునందును, ఇత్యాది నిపుణసిద్ధాంతములు గనుపించుట యందు సూక్ష్మబుద్ధిగలవారు. ఇంకా వడ్రంగము, వెండి పనులు, కమ్మరము, గోడలుకట్టుట, పరదేశీయులతో వ్యాపారముజేసి ధనమార్జించుట ఇత్యాది వృత్తులన్నియు క్రమేణ ఇప్పుడు అనేకయంత్రములను కల్పించుమనవిదేశీ యులవలె ననుష్ఠించుచు అనేకములగు మార్పువృత్తులతో ధన మార్జించుచుండువారు. వీరికి ఆహారము గోధుమలు, మాంసము, పాలు, వెన్న, కాయగూరలు, గడ్డదినుసు లు వగైరాలు.

ఆకాలపు ఆర్యులస్త్రీలుగూడ వ్రాయుట, చదువుట యందు నేర్పుగలవారలు. ఋగ్వేదములోని మంత్రము లనేక ములు స్త్రీలచే రచింపబడినవి. విశ్వావారా శ్రద్ధా, సూర్యా, మొదలగుస్త్రీలు ఋగ్వేదములోని కొన్ని సూక్తములు రచి యించిరి. ఇంకా ఋషులతో జేరి యజ్ఞయాగాది క్రతువులు జరుపుచుండిరి. కొంతమంది స్త్రీలు బ్రహ్మచర్యవ్రతమును జేయుచుండిరి. అప్పుడు అతిబాల్యవివాహములును లేవు. వితంతువులు మరల వివాహమును చేసికొనగూడ దను నిబంధ నయును లేదు. సహగమనమును లేదు. అనేకమందిస్త్రీలు పురు షులను ధనమును జూచి మోహింతురు. స్త్రీలకుగూడయుద్ధ

మునందు ప్రవేశముగలదు. ఆకాలపుస్త్రీలు చీరెలు, రవి కెలు ధరించువారు. పురుషులు దోవతియుత్తరీయములను ధరించువారు. తత్పూర్వపుస్త్రీలునుగూడ అగ్నిహోత్రాదికములు స్వతంత్రముగా జేయుచున్నట్లును, కౌసల్య స్వతంత్రముగా అగ్నిహోత్రాదికము లాచరించుచున్నట్లును, సీతకు సంధ్యావందన మాచరించు నలవాటున్నట్లును, ఆకాలపుస్త్రీలు రాణివాసమువదలి రాజసభలకు వెళ్ళి పండితులతో విద్యను గూర్చి చర్చించినట్లును రామాయణమందుననే వ్రాయబడియున్నది. ఇది యిట్లుండ ఆర్యుల టయిములోనే సుమారు 4000 సంవత్సరములకు పూర్వమే సంస్కృతములో వ్రాయబడియుండుచు వీరి పరిపాలనలో యీ ఋగ్వేదమునందలి ఆర్యులు హిందూదేశమునకు వచ్చి పరిపాలనాది అనేక అంశములతో గ్రంథవిస్తరముగా వ్రాయబడియున్నది. హిందూమతసంబంధమగు చరిత్రవిషయమగు యీ వేదమునందు అనేకఅంశములు యీటయిములోనే చేర్చబడియున్నవి. అనంతరము కొన్నివత్సరములకు, యజుర్వేదము, సామవేదము, అధర్వవేదము లను వానినికనిపెట్టి సంస్కృతములో వ్రాయబడినవి. అంతనుండి ఆలోగడ బ్రహ్మయొక్క ద్వితీయసృష్టిలో కనబఱచిన ఉపనిషచ్ఛాస్త్ర పురాణములు వగైరా అనేకవిషయములును ఆర్యుల టయిముననే రచియింపబడినవి. ఇట్లున్న కాలమున వారికి వర్ణభేదములు లేవు. కాని కాలక్రమముగ

నేకవృత్తులను ఆర్యులే అనేకసంఘములుగా మారి ఆయా వృత్తులను కనిపెట్టి తత్సంబంధమైన కృషిమార్గముతో జీవించుచూ వచ్చుచున్నందువలన అందున ఆర్యులే పరిపాలకులుగా నుండుటయు అందుకొందరు వేదాధ్యయన యజనాది మార్గముగా వర్తించుచు లా(ధర్మ) చట్టములు కొన్ని వ్రాయుచుండుచు ఆయా కృషిసంబంధమైనటువంటి ఆయా సాంఘికులకు వాణిజ్యాదికృషిభేదము ననుసరించి బ్రహ్మ క్షత్రియ వైశ్యశూద్రాది జాతిభేదములుగా నడుపుచు వచ్చిరి. ఇదియే జాతిభేదరహస్యవిచారణగాని ఆదియందు శ్రీమన్నారాయణునియొక్క అవయవాది స్థానములలో మానవులు వేరుగా జనించినందువలన జాతిభేదములు గలిగినవిగావని విజ్ఞులు స్పష్టముగా నెఱింగి, సత్యసమష్టిభూతదయతో సర్వజనులు నటించి సుఖింతురుగాక. మీ రొక్క ప్రత్యక్షప్రమాణమును వినుడు. "విష్ణుపాదాబ్జసంభూత గంగా త్రిపథగామిని" అను శ్రుతివచనప్రకారము గంగభవాని శ్రీమహావిష్ణుని పాదములనుండియే జనించెననిగదా చెప్పుచున్నది. అట్టివిషయమును గురించి శ్రీమహావిష్ణువు పాదమూలము క్షద్రత్వముక్రిందమార్చినయెడల ఆగంగాభవానిలో భగవంతుని ముఖజనితులమను కొను బ్రాహ్మణులు స్నానపానాదులు చేయుటకు వీలులేదు కదా! భగవంతుని పాదములకు నమస్కరించుటకు వీలులేదు గదా గనుక విజ్ఞులు దెలిసికొందురుగాక. అయితే "బ్రాహ్మ

ణోస్యముఖమాసీత్" అనుపదముతో శ్రుతి యెందుకు విధించె ననుప్రశ్నకు సమాధానము ముం దధ్యాయమున వ్రాయుదును. గ్రహించుడు. ఈ ఆర్యుల పరిపాలన క్రీస్తుశకమునకు పూర్వము రెండువేల సంవత్సరములు ముందున్ను క్రీస్తు అనంతరము పన్నెండువందల సంవత్సరములును జరుగబడినది. తదుపరి క్రీస్తుయొక్క పదమూడవ శతాబ్దము మొదలు పదునెనిమిదవ శతాబ్దములోపల మహమ్మదీయ పరిపాలనము జరిగినది. అంతనుండి యిప్పుడు బ్రిటిషుపరిపాలన జరుగుచున్నది. ఇందలి విషయములన్నియును విజ్ఞులందరు ఆత్మానుభవముతో యథార్థవాదముతో గ్రహించుదురుగాక.

శ్రీమన్నారాయణ వరప్రసాదలబ్ధ కవితావిలాస పోకా వెంకటకృష్ణదాసప్రణీతంబైన జాతీయధర్మ తత్త్వరహస్యమునందుగల చతుర్ముఖ బ్రహ్మయొక్క ప్రథమసృష్టియు, ద్వితీయసృష్టియు, తృతీయసృష్టియు, ఇందలి జాతీయ చతుర్థభాగ సంకరభాగవిచారణయు, హిందూదేశ ఆర్యపరిపాలన, జాతీయశాస్త్ర విచారణయు గల తృతీయాశ్వాసము సర్వము సమాప్తము.

---

శ్లో॥ బ్రాహ్మణక్షత్రియవిశాం, శూద్రాణాంచ పరంతప!
కర్మాణి ప్రవిభక్తాని, స్వభావప్రభవైర్గుణైః
—భగ. 18 అ. 41 శ్లో.

తా॥ అర్జునా! పూర్వజన్మకర్మవశమున మానవులకు నైజముగా ఒకనికి బ్రహ్మవిద్యానుష్ఠానము లభించుటయు, మఱియొకనికి రాజకీవి లభించుటయు, ఇంకొకనికి వ్యాపారము లభించుటయు, కొంతమందికి జీవహింసాది పాపకార్యము లభించుటయు నైజమైయుండును. (అందువలన వారి వారి గుణకార్యముల ననుసరించి ఇతను యీ జాతివాడని గమనించుమని) యీ శ్లోకాభిప్రాయము నుడివియుండగా బ్రాహ్మణునికి సత్వాదిగుణములును, క్షత్రియులకు రాజసాదిగుణములును ఇత్యాదులు ఆయా జాతులకు ఆయా జాతిగుణములు నైజముగాగల్గునని గీతయందు తాత్పర్యము వ్రాసిరి. ఈ యథార్థమునే మీరు కనుపింపజేయవలసియున్నది. ఎట్లనగా ఈలోకమందు పరీక్షించిన బ్రాహ్మణులు క్షుద్రకార్యములు సేయుటయు, శూద్రులు బ్రహ్మతత్వరు లగుటయు, మహమ్మదు లాదిగాగల సర్వులు రాజ్యపరిపాలనాప్రవేశము సంపాదించుటయు నైజమైయుండగా యీ పైజాతులలో ఫలానిజాతి వంశపరంపరులకు ఫలానిగుణములే నైజముగా బుట్టునని పై శ్లోకమునకు తాత్పర్యము వ్రాయుట ఎంత స్వధర్మమో విజ్ఞులు తెలియునది. ఈ విషయమును

గురించియే శ్రీ వేదవ్యాసులు యీక్రిందివరీతి జాతీయసమష్టిని గురించి యథార్థాభిప్రాయము వెల్లడించెను. ఇదియే వ్యాస మతమనియును ఆదిశంకరులు తాను వ్రాసిన సర్వసిద్ధాంత సంగ్రహములో యీ శ్లోకము నుదాహరించెను. గ్రహించు నది.

శ్లో॥ బ్రహ్మక్షత్రియవిట్ఛూద్రాం, చాతుర్వర్ణ్యాన్ గుణాత్మకాన్
విప్రశ్శుక్లోనృపోరక్తః, పీతోవైశ్యోఽస్త్యజోఽసితః.

తా॥ ఈ సర్వప్రజలలో నాలుగు జాతులవారిని తెలిసి కొన వలయుననిన బ్రాహ్మణుడు తెల్లనివాడు, క్షత్రియుడు యెర్రనివాడు, వైశ్యుడు పచ్చనివాడు, శూద్రుడు నల్లని వాడు అని యెరుగవలయుననియెను. ఎట్లనగా శరీరమును జూచిగాదు. గుణములచేతనని యర్థము. అందు తెల్లనిదియగు శుద్ధసత్వగుణము గలవాడు బ్రాహ్మణుడనియును, యెర్రనిది యగు రజోగుణముగలవాడు క్షత్రియుడనియు, మిశ్రమమగు పచ్చని గుణము గలవాడు వైశ్యుడనియు, నల్లనిదియగు తమోగుణము గలవాడు శూద్రుడనియు వర్ణించి ఆయా గుణ ములగలవానిని ఆయా జాతిగలవానిగా నెరుంగవలయు ననిరి. ఎట్లనగా,

శ్లో॥ ప్రవర్తయతి తత్ కర్మ, పరిపాకక్రమం విదన్,
ఋజవశ్శుద్ధవర్ణాభాః, క్షమావంతో దయాళవః
స్వధర్మనిరతా యేస్యుస్తేద్విజేషు ద్విజాతయః.

తా. అనగా కర్మపరిపాకము ననుసరించి ఒక్కొక్కరు ప్రవర్తించెదరు. అందు మనోవాక్కాయ సిద్ధిగా ప్రవర్తించు వారును, బ్రహ్మవిద్యయందు నిష్ఠాగరిష్ఠులును, దయాసత్య శౌచాదులు గలవారును ద్విజులలో బ్రాహ్మణు లనబడు దురు.

శ్లో॥ కామభోగప్రియా స్తీక్ష్ణాః, క్రోధనాః ప్రియసాహసాః
త్యక్తస్వధర్మరక్తాంగా, స్తేద్విజాః క్షత్రతాం గతాః.

తా॥ కామపరవశులై, భోగాసక్తులై, కఠినస్వభావము గలవారలై, క్రోధులై, సాహసులై, బ్రహ్మకర్మను విడిచిన వారలై వర్తించునట్టి ద్విజులు క్షత్రియత్వమును బొందుదురు.

శ్లో॥ గోషు వృత్తిం సమాధాయ, పీతాఃకృష్యుపజీవినః
నస్వకర్మ కరిష్యంతి, తేద్విజాః, వైశ్యతాం గతాః.

తా॥ గోపరిపాలన, వ్యవసాయములచే జీవించువారును, మిశ్రమగుణములుగలిగి తపస్సు, వేదాధ్యయనాది బ్రహ్మ కర్మనువదలి వర్తించువారును నగు ద్విజులు వైశ్యత్వమును బొందుదురు.

శ్లో॥ హింసాఽనృతప్రియాః క్షుద్రా స్సర్వకర్మోపజీవినః
కృష్ణాఃశౌచపరిభ్రష్టా, స్తే ద్విజాః, శూద్రతాం గతాః

తా॥ మనోవాక్కాయములచే ప్రాణిహింస జేయు వారలును, అసత్యభాషణప్రియులై నీచదేవతోపాసనలు, నీచకార్యలోలత్వ, వాద భేద, దంభ, దర్ప, ఈర్ష్యాదులతో

వర్తించుటయు గలిగినట్టి ద్విజులు శూద్రత్వమును బొందు దురు. ఇట్లే,

శ్లో॥ విస్తృత్య ధర్మశాస్త్రేహి, తేషాం కర్మ సమీరితం,
ఏకస్మి న్నేకవర్ణేతు, చాతుర్వర్ణ్యం. గుణాత్మకం.

తా॥ ఈశ్లోకంబున కల్పితాంశమై నామావశిష్టమాత్రం బైన చాతుర్జాతిమానవులలో ధర్మశాస్త్రప్రకారము పైజెప్పి నట్లు వారివారి గుణవ్యాపారముల ననుసరించి బ్రాహ్మణులలో క్షత్ర, వైశ్య, శూద్రులున్నారు. రాజులలో ద్విజవైశ్యశూద్రు లున్నారు. వైశ్యులలో బ్రాహ్మణ క్షత్రియ శూద్రులున్నారు శూద్రులలో బ్రాహ్మణ క్షత్రియ వైశ్యు లున్నారు. అని వేదవ్యాసుడు యథార్థాభిప్రాయమును వెల్లడించెను. (కనుక సర్వజనులలో వారివారి గుణవర్తనయే జాతిరూపముగాని వంశగోత్రపరంపరగా దని స్పష్టము.)

కాన మన మిప్పుడు గ్రహించవలసిన సృష్టిలో గల జాతులు నాలుగున్నవి. ఎట్లనగా శుద్ధసత్త్వప్రజ్ఞానసంఘముగల వారలందరును బ్రాహ్మణులనియును, రజోగుణసాహసులగు సంఘమువార లందరును క్షేత్రపాలకులు గనుక క్షత్రియు లని యును, త్రిగుణమిశ్రమ లౌకికవర్తన సాంఘికులందరు విశ్వావ లోకనులుగనుక వైశ్యులనియును, జీవహింసాది పాపంబులగు క్షుద్రకార్యము లాచరించువారలందరు శూద్రులనియును

నెఱిగి వారిగుణముల ననుసరించియే కులములు యీసృష్టి లోగల మానవకోటి నాలుగుజాతులుగా తెలియునది.

ఇందులకు శ్రుతిపురాణేతిహాససిద్ధాంతప్రమాణములను గూడ చక్కగ నాలింపుడు.

—* వేదస్వరూపమైన వజ్రసూచికోపనిషత్ *—

శ్రుతి:-వజ్రసూచీం ప్రవక్ష్యామి, జ్ఞాన మజ్ఞానభేదనం,
దూషణం జ్ఞానహీనానాం, భూషణం జ్ఞానచక్షుషామ్. 1

తా॥ అజ్ఞానమును ఖండింప నాయుధమును, జ్ఞానహీనుల దూషించునదియు, జ్ఞానదృష్టులకు నాభరణము బోలినదియునగు వజ్రసూచికోపనిషత్తును జెప్పుచున్నాఁడు.

శ్రుతి:-కోవాబ్రాహ్మణోనామ? కింజీవః? కిందేహః?
కింజాతిః? కింజ్ఞానం? కింకర్మ? కింధార్మికః? ఇతి
—వజ్రసూచికోపనిషత్. 2

తా॥ బ్రాహ్మణు డనగా నెవడు ? అతడు జీవుడా? దేహమా? వర్ణమా? జ్ఞానమా? కర్మమా? ధర్మము ననుష్ఠించువాడా?

శ్రుతి:-తత్రప్రథమో జీవో బ్రాహ్మణఇతి, తచ్చేన్న అతీతానాగతానేకదేహానాం, జీవస్యైకరూపత్వాత్. 3.

తా॥ ఈ పైన జెప్పబడినవానిలో మొదట జీవుడు బ్రాహ్మణుడనిన నయ్యది కాదు. ఏలయన ఇదివరకు గడచినవియు ఇకమీద రాబోవునవియు ననేకదేహములు జీవునకు సమానములు. జీవు డొక్కడయ్యును కర్మాధీనమువలన పంచములాదిగాగల అనేకదేహముల బుట్టుచున్నాడు. అందు సమ

స్త దేహములందు జీవు డొక్కటేరూపమున నున్నాడు. కావున జీవుడు బ్రాహ్మణుడు కాడు.

శ్రుతి:-తర్హి దేహో బ్రాహ్మణ ఇతిచేన్న ఆచండాలాదిపర్యంతానాం,మనుష్యాణాం పాంచభౌతిక త్వేన దేహ స్యైకరూపత్వాత్.

తా॥ అయితే దేహము బ్రాహ్మణుడనినయెడల నదియు కాదు. దేహము పంచభూతములతో మిశ్రిత మగుటవలన నదియు కాదు. మనుష్యులదేహము లొక్కటే రూపముగా నుండుటవలనను, ముసలితనము, మరణము, ధర్మము, అధర్మము మున్నగునవి యెల్లరకు సమానము లగుటవలనను బ్రాహ్మణుడు తెల్లనివాడు, క్షత్రియుడు యెర్రనివాడు, వైశ్యుడు పచ్చనివాడు, శూద్రుడు నల్లనివాడను శరీరనియమము లేకుండుటవలనను తండ్రి మున్నగువారిని హింసించునెడల సర్వులకు బ్రహ్మహత్యాది దోషములు సంభవించును గావున దేహము బ్రాహ్మణు డనగూడదు.

శ్రుతి:-తర్హి జాతి ర్బ్రాహ్మణ ఇతిచే న్న తత్ర జాత్యంతరే
ష్వనేకజాతి సంభవాత్, మహర్షయోభవస్సంతి. 5

తా॥ వర్ణము బ్రాహ్మణుడనినయెడల నదియుగాదు. ఒక వర్ణములోనే యనేకవర్ణములు గలుగుటవలనను, అనేక మహర్షులు ఋశ్యశృంగుడు లేడివలనను, కౌశికుడు దర్భవలనను, జాంబూకుడు నక్కవలనను, వాల్మీకుడు పుట్టవలనను, వ్యాసుడు చంబళస్త్రీవలనను, గౌతముడు కుందేటి

పేపునను, వసిష్ఠుడు ఊర్వశియందును, అగస్త్యుడు కుండ యందును బుట్టినట్లు దెలియుచుండుటవలనను వీరిలో జాతి లేకయే జ్ఞానము గలుగజేయు ఋషులు అనేకు లుండుటవల నను వర్ణము బ్రాహ్మణు డనకూడదు.

శ్రుతి:-తర్హి జ్ఞానం బ్రాహ్మణ ఇతిచే న్నక్షత్రియాద యోఽపిపర మార్థదర్శినోఽభిజ్ఞాబహవస్సంతితస్మాన్న జ్ఞానం బ్రాహ్మణఇతి 6

తా॥ పారమార్థిక తెలివి బ్రాహ్మణుడనినయెడల నది యుగాదు. తెలివిగలవార లన్ని జాతులలో నున్నారు. కావున తెలివియు బ్రాహ్మణు డనగూడదు.

శ్రుతి:-తర్హి కర్మ బ్రాహ్మణ ఇతిచే న్న సర్వేషాం ప్రాణినాం ప్రారబ్ధసంచితాగామి. 7

తా॥ కర్మ బ్రాహ్మణుడనినయెడల నదియుగాదు. సమస్తప్రాణులకును ఆగామిసంచితప్రారబ్ధము లనుకర్మలు సమానముగ గనుబడుచున్నందువలనను కర్మములచే ప్రేరే పింపబడిన జను లాకర్మములకు దగిన కార్యములు జేయు చున్నందునను కర్మ బ్రాహ్మణు డనగూడదు.

శ్రుతి:-తర్హి ధార్మికోబ్రాహ్మణఇతిచేన్న క్షత్రియాద యోహిరణ్యదాతారో బహవస్సంతి, తస్మాన్న ధార్మికోబ్రాహ్మణఇతి. 8

తా॥ ధర్మముసేయువాడు బ్రాహ్మణుడనినయెడల నది యు గాదు. దానధర్మములు సేయువారు అన్నిజాతులలో

గలరు. అందువలన ధార్మికుడు బ్రాహ్మణు డన గూడదు.
శ్రుతి:-తర్హి కోవా బ్రాహ్మణో నామ?
అట్లైన బ్రాహ్మణుడనగా నెవడు ?
శ్రుతి:-యఃకశ్చిదాత్మానామద్వితీయం,జాతిగుణక్రియాహీనం
.................అనుభవైకవేద్య మపరోక్షతయా
భాసమానంకరతలామలకవత్సాక్షాదపరోక్షీకృత్యకృతా
ర్థతయా । కామరాగాది దోషరహితశ్శమదమాదిగుణ
సంపన్నో, భావమాత్సర్య తృష్ణాశామోహాది రహి
తో దంభాఽహంకారాదిభి రసంస్పృష్టచేతా వర్తత ఏవ
ముక్తలక్షణో య స్స ఏవ బ్రాహ్మణ ఇతి శ్రుతిస్మృతి
పురాణేతిహాసానా మభిప్రాయః. అన్యథా బ్రాహ్మ
ణత్వసిద్ధి ర్నాస్త్యేవ.

తా॥ అద్వితీయుడును, జాతిగుణక్రియలు లేనివాడును, షడూర్ములు లేనివాడును, షడ్భావవికారములు లేని వాడును, సత్యజ్ఞానానందాదిఅనంతకల్యాణైశ్వర్యములు గలవాడును ... ... ... ... ... అనుభవముచేతనే తెలియదగిన వాడును ప్రత్యక్షముగా ప్రకాశించు వాడు నగు భగవంతుని అరచేతిలోని యుసిరికకాయవలె జక్కగ ప్రత్యక్షము జేసికొని కృతార్థుడై కామక్రోధాదులు లేనివాడై శాంతశమద మాదులు గైకొనినవాడై అహంకార మమకారములు యెవరి మనస్సున జొరనీయక యుండునో అట్టి లక్షణములు గలవాడే

బ్రాహ్మణుడనిశ్రుతిస్మృతిపురాణేతిహాసములయభిప్రాయ
అట్టు కాదేని బ్రాహ్మణసిద్ధియే లేదు.

పురాణేతిహాసముల ప్రమాణములు వినుడు.

శ్లో॥ నమోహం సర్వభూతేషు, నమే ద్వేష్యోస్తినప్రి
యేభజంతితు మాం భక్త్యా, మయి తే తేషు చాప్యహ

—భగవద్గీత

తా॥ అర్జునా! నేను భూతములయందు భేదము
సమముగ నున్నాను. నా కొకడు ద్వేషింప దగినవాడుగా
ప్రేమింపదగినవాడుగాని లేడు. అయినను యెవడు నన
అనన్యభక్తితో సేవించునో అట్టిభక్తుడు సదా నాయం
డుండును. నేను వానియం దుండుదును. (అని శ్రీకృష్ణప
మాత్మ సమష్టిగా నుడివియుండెను. ఇక వామనపురాణమ
నందు శ్రీ విష్ణుమూర్తి భూదేవితో నుడివిన ప్రమాణవాక్య
ములను వినుడు.

శ్లో॥ మద్భక్తం శూద్రసామాన్య, మవమన్యంతి యేనరాః,
నరకేష్వవతిష్ఠంతి, వర్షకోటిర్నరాధమాః.

తా॥ ఏమానవులు శూద్రజన్మమునందు జన్మించిన
నాయొక్క భక్తుని శూద్రసామాన్యునిగా దలచి యవమా
నింతురో వారు కోటిసంవత్సరములు నరకమునందు బడి
యుందురు.

శ్లో॥ మద్భక్తంశ్వపచంవాపి నిందా కుర్వంతి యే నరాః,
పద్మకోటిశతే నాపి, నక్షమామి వసుంధరే!

తా॥ ఓ భూదేవి! నాభక్తుడు శ్వపచుడైనను వానిని నింద జేసిన వారిని పద్మకోటిశతవత్సరముల కైనను శిక్షింపక విడువనుసుమా!

శ్లో॥ భక్తి రష్టవిధాహ్యేషా, యస్మిన్ మ్లేచ్ఛేపివర్తతే
సవిప్రేంద్రో మునిశ్శ్రీమాన్, సయతిః సచపణ్డితః,
తస్మైదేయం,తతోగ్రాహ్యం,సచపూజ్యోయథాహ్యహం.

తా॥ అష్టవిధములగు భక్తి మ్లేచ్ఛునియం దుండినను వాడే బ్రాహ్మణోత్తముడు, వాడే మునీశ్వరుడు, వాడే శ్రీమంతుడు, వాడే సన్యాసి, వాడే పండితుడు. వానికి సర్వవిద్యల నియ్యవచ్చును. వానియొద్దనుండి సర్వవిద్యలు సద్గుణములు గ్రహింపవచ్చును. వానిని భగవంతుడనగు నన్ను పూజించునట్లే పూజించవచ్చును.

శ్లో॥ చండాలమపి మద్భక్తం, నావమన్యేతి బుద్ధిమాన్
అవమానాత్పతత్యేవ రౌరవే నరకే చనః.

తా॥ హీనజాతియందు బుట్టినవాడైనను వానికి నా భక్తిగలిగియుండనేని అట్టివానిని బుద్ధిమంతులగువారు నిందించరాదు. అట్టి నా భక్తుల నవమానపరచినవారు రౌరవ నరకమును బొందుదురు. ఇట్లుశ్రీమన్నారాయణుండు వాక్రుచ్చి

సత్యసమష్టి జెప్పుటయేగాక 'యోగసారము' నందు యీశ్వరుని వాక్యంబులు వినుడు.

శ్లో॥ ఏతైః కర్మఫలైర్దేవి న్యూనజాతికులోద్భవః
శూద్రోఽప్యాగమసంపన్నో ద్విజోభవతిసంస్కృతః.

తా॥ ఓ పార్వతీ! పైనజెప్పిన పుణ్యకర్మలే బ్రాహ్మణత్వమునకు గారణములేగాని వేరుగా జాతిపుట్టలేదు. వేద విధానము తెలిసిన శూద్రుడైనను బ్రాహ్మణుడే (గనుక)

శ్లో॥ ద్విజవ త్క్షత్రియస్యోక్తః, ప్రాణాయామో మహామునే
విరక్తానాం ప్రబుద్ధానాం, వైశ్యానాంచ తథైవచ
శూద్రాణాంచ తథా స్త్రీణాం, ప్రాణసంయమనం మునే.

తా॥ ఓ మునిసత్తమా! ప్రాణాయామము మొదలుగాగల యోగశాస్త్రమునందుద్విజుల కెంత యధికారము కలదో అంతటి యధికారము క్షత్రియులకున్ను, ప్రబుద్ధులు, విరక్తులు నగువైశ్యులకును అట్లే శూద్రులకును స్త్రీలకును గలదు.

శ్లో॥ కర్మభిశ్చ శుచిర్దేవీ, శుద్ధాత్మా విజితేంద్రియః
శూద్రోఽపి ద్విజవత్సేవ్య ఇతి బ్రహ్మానుశాసనం.

తా॥ పార్వతీ, శుద్ధములగు సాత్త్వికకర్మలతోగూడినవాడై పరిశుద్ధాత్ముడై జితేంద్రియుడైనవాడు శూద్రకులజుడైనను వాడు ద్విజులలో బ్రాహ్మణునివలె పూజింపదగినవాడని బ్రహ్మశాసనము.

ఇక భారతభాగవతాది ప్రమాణములను వినుడు.

శ్లో॥ నశూద్రా భగవద్భక్తా, విప్రా భాగవతాస్స్మృతాః,
సర్వవర్ణేషు తే శూద్రా, యే హ్యభక్తా జనార్దనే.

తా॥ శూద్రకులమునందు జన్మించినవాడైనను దైవభక్తి వానికున్నట్లైన వాడే విప్రోత్తముడు, భాగవతోత్తముడని యెఱుంగునది. సర్వవర్ణములలో శూద్రుడెవడనగా దైవభక్తి లేని వాడే (అని భారతము).

శ్లో॥ శ్వపచోపి మహీపాలో, విష్ణుభక్తో ద్విజాధికః
విష్ణుభక్తివిహీనస్తు, యతిశ్చ శ్వపచాధమః.

తా॥ ఓయిరాజేంద్రా! శ్వపచుడైనను వాడు భగవద్భక్తిగలిగియున్నచో బ్రాహ్మణాధికుడే. దైవభక్తిలేని యతియైనను చండాలాధముడే అని భాగవతము.

ఇటువంటి ప్రమాణములు కోట్లకొలదిగా నున్నవిగాని గ్రంథవిస్తరభీతిచే నింతట విరమించుచున్నాడను.

ఇంకొక్క సాక్ష్యమును మాత్రము వినుడు.

శ్రీ మహాభారతము ఆరణ్యపర్వము యక్షప్రశ్న,
312 అ. 105 శ్లో.

శ్లో॥ రాజన్ కులేన వృత్తేన, స్వాధ్యాయేన శ్రుతేనవా
బ్రాహ్మణ్యం కేన భవతి, ప్రబ్రూహ్యేతత్సునిశ్చితం.

తా॥ ఓరాజా! బ్రాహ్మణ్యము దేనివలన గలుగుచున్నది! కులముచేతనా ? గుణముచేతనా ? అధ్యయనము

చేతనా? ధర్మములు వినుటచేతనా? (అని యక్షుడు ప్రశ్న చేయగా ధర్మజుడిట్లు ప్రత్యుత్తరమిచ్చెను.)

శ్లో॥ శృణు యక్షకులంతాత, నస్వాధ్యాయో, నచశ్రుతం
కారణంవాద్విజత్వేచ, వృత్తమేవ నసంశయః
నయోనిర్నాపి సంస్కారో, నశ్రుతం నచసంతతిః
కారణానిద్విజత్వస్య, వృత్తమేవతుకారణం.

తా॥ ఓయక్షుడా! వర్ణమును వినుము. తండ్రి! బ్రాహ్మణ్యమున కధ్యయనము గాదు. ధర్మములు వినుటగాదు. గర్భాధానసీమంతాది సంస్కారముల బొందుటగాదు. వంశపరంపరలుగాదు. సద్వృత్తియే బ్రాహ్మణ్యమునకు కారణము. (అని ధర్మజుడు నుడువగా యక్షుడు మరల నిట్లు ప్రశ్నించెను.

శ్లో॥ బ్రాహ్మణః కోభవేద్రాజ, వేద్యంకించ యుధిష్ఠిర.
అరణ్య. 180 అ. 20 శ్లో.

తా॥ ఓధర్మరాజా బ్రాహ్మణుడన నెవ్వడు, తెలిసికొనదగిన దెయ్యది? (ధర్మరాజిట్లుప్రత్యుత్తరమిచ్చెను.)

శ్లో॥ సత్యందానం క్షమాశీల, మానృశంస్యం తపోఘృణా
దృశ్యంతే యత్ర నాగేంద్ర సబ్రాహ్మణఇతిస్మృతః.

తా॥ ఓ నాగేంద్రుడా! సత్యము, దానము, ఓర్పు, ఆచారము, అహింస, తపము, దయ ఎవనియందు గలవో వాడు బ్రాహ్మణు డని శాస్త్రప్రసిద్ధము.

శ్లో॥ శూద్రేతుయద్భవేల్లక్ష్యం, ద్విజేతచ్చనవిద్యతే,
నైవశూద్రో భవేచ్ఛూద్రో, బ్రాహ్మణో నచబ్రాహ్మణః

తా॥ ఈపై చెప్పంబడిన గుణము లెవ్వనికిగలవో వాడు శూద్రుడయ్యును శూద్రుడుకాడు. ఎవనియం దీ సద్గుణములు లేవో వాడు బ్రాహ్మణుడయ్యును బ్రాహ్మణుడు గాడు.

శ్లో॥ యత్రైతల్లక్ష్యతే సర్పవృత్తం। సబ్రాహ్మణ ఇతిస్మృతః.
యత్రైతన్నభవేత్సర్పం। తం శూద్ర మితి నిర్దిశేత్.

—భారత. అరణ్య. 180 అ. 28 శ్లో.

తా॥ ఓ సర్పరాజా! యీ సద్గుణము లెవ్వనియందు కనబడుచున్నవో వాడే బ్రాహ్మణుడు. ఎవనియం దీ గుణములు లేవో వాడు శూద్రు డని ధర్మజుడు ప్రత్యుత్తర మిచ్చెను.

కనుక నా సోదరీసోదరులారా! శాస్త్రవాసన, లోకవాసన, దేహవాసన యను వాసనత్రయములో మునిగి వ్యష్టిభావనతో సజ్జనులను దూషణభూషణతిరస్కారంబు లాడి కాలపురి కండ్లజూడక సత్యసమష్టితత్త్వము నెరింగి సర్వభూతదయాళువులై సర్వులు సుఖింతురుగాక.

ఈ ప్రకారము చాతుర్జాతులయందును గుణతత్త్వానుభవమే బ్రాహ్మణస్వరూపముగా శ్రుతిస్మృతిపురాణేతిహాససిద్ధాంతప్రతిపాదకనిర్ణయ ముండుటయును తదనుగుణముగా ఈముందు సోపానమున సర్వజనసమష్టి ఆచరణానుకూల

ముగా సర్వధర్మములు విధించియుండెను. ఇట్టి రహస్యశాస్త్ర చట్టములుండగా- పండితులైనవారు.

శ్రుతి:—బ్రాహ్మణో స్య ముఖ మాసీత్
బాహూ రాజన్యః కృతః.

అని పురుషసూక్తమునందు విధించబడి ఆ విరాట్పురుషునియొక్క ముఖమునందు బ్రాహ్మణులును, భుజములయందు క్షత్రియులును, యూరువులయందు వైశ్యులును పాదములయందు శూద్రులును జనించిరనియు అందున వారివారి కర్మకర్తృత్వ ధర్మాచరణానుకూలము వేరువేరుగా నుండు ననియు చెప్పిన ఋషిప్రోక్తాభిప్రాయకారణ మేమనిన మీకు ప్రథమాదిగల యీలోగడజెప్పిన అధ్యాయము లన్నిటియందు క్రమేణ మానవు లెట్లు జనించినవిధమున్ను వారలు లోకనటనార్థమై చాతుర్జాతులు యెప్పుడు నిర్ణయించుకొన్న విషయమున్ను అందు గుణప్రధానమే అగ్రజాతిస్వరూపమనియును వ్రాసియున్నాడను. ఇకముందు అధ్యాయమున సర్వజనసమష్టికర్మాచరణానుకూలశాస్త్రచట్టములగు ఋషిప్రోక్తాభిప్రాయములనే మీకు సమగ్రముగా వెల్లడింతును. కనుక సర్వులును ఆత్మదృష్టితోయిందు సర్వసమష్టితత్త్వము నుగ్రహించునది.

అయితే పైప్రశ్నకు సమాధాన మేమనగా—

శ్రుతి:- బ్రాహ్మణోఽస్యముఖమాసీత్, బాహూరాజన్యః కృతః ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాగ్ం, శూద్రో అజాయత.

(1) టీక:—అస్య = ఈ విరాట్పురుషుని యొక్క - ముఖమ్ = ముఖముగా - బ్రాహ్మణుడు = అనగా ఉత్తమజ్ఞాన సంపన్నుడు - ఆసీత్ = ఆయెను.

(2) అస్య = ఈ విరాట్పురుషునియొక్క - బాహూ = బాహువులుగా - రాజన్యః = రాజశ్రేష్ఠుడు - కృతః = చేయ బడెను.

అని యీవిధముగా నాలుగు పాదములయందు విజ్ఞాన వంతుడగు వాడు విరాట్పురుషుని ముఖముగా ఆయెననియు, రాజశ్రేష్ఠుడు అతని బాహువులుగా చేయబడెననియు, వైశ్యుడు అట్లే యూరువులుగా చేయబడెననియు, శూద్రుడు పాదముల యందు కలిగెననియు నుడివినట్టి యిందలి యథార్థాభిప్రాయము విజ్ఞులు గ్రహించునది. ఎట్లనగా— "దీక్షతోఽయం బ్రాహ్మణః" అనియు "అదీక్షిష్టాయాం బ్రాహ్మణః" అనగా యితడు దీక్షవహించి బ్రాహ్మణుడాయెను. అని శ్రుతిప్రతిపాద్యము వదంతిజేసిపలుకుచుండుటయును అందు "అథాతో్ర్ద్ధా జాయతే యోబ్రాహ్మణో యోయజ్ఞాజ్జాయతే - తస్మాదపి రాజన్యంవా వైశ్యంవా బ్రాహ్మణ ఇత్యేవ బ్రూయాత్ - బ్రాహ్మణోహి జాయతే యో యజ్ఞాజ్జాయతే"

—శతపథబ్రాహ్మణము (3-2-1-40)

తా॥ యజ్ఞముననుండి జన్మించినవాడు (అనగా యజ్ఞదీక్షితుడు) ప్రత్యక్షముగనే బ్రాహ్మణుడై పుట్టుచున్నాడు. కాబట్టియే దీక్షితుడగు క్షత్రియుని, వైశ్యునిగూడ బ్రాహ్మణుడనియే చెప్పవలయును. యజ్ఞమునుండి పుట్టినవాడు బ్రహ్మనుండియే పుట్టినవాడుగదా. (కాబట్టి దీక్షితులైన క్షత్రియులు, వైశ్యులు బ్రాహ్మణులే) అని శ్రుతి విధించుటచే ఇచట యజ్ఞదీక్షాకాలమునందు బ్రాహ్మణత్వము సిద్ధించినట్లును తత్పూర్వము బ్రాహ్మణత్వమాతనికి లేనట్లును స్పష్టముగదా! ఇదియిటులుండ యజ్ఞదీక్షకులైన క్షత్రియవైశ్యాదులకు బ్రాహ్మణత్వము లభించెనని ఎట్లుచెప్పబడెనో అట్లే "అయమాత్మాబ్రహ్మ" (మాండూక్యోపనిషత్) అనగా ఈమనఆత్మయే సర్వకారణభూతమగు బ్రహ్మ. బ్రహ్మవేద బ్రహ్మైవభవతి (ముండకోపనిషత్) అనగా బ్రహ్మను తెలిసినవాడు బ్రహ్మయే యగుచున్నాడు. అను శ్రుత్యర్థము ననుసరించియే మహాత్ములగు తత్త్వవేత్తలందరును "అహం బ్రహ్మాస్మి" అనగా నేనే బ్రహ్మనైతిని అని స్వానుభూతిని పొందుచుందురు. కనుక యిట్టి ఆత్మదీక్షకులెల్లరును బ్రహ్మముఖస్థానమగు ఆత్మస్ఫురణిని పొందినవారుగనుక పై శ్రుతియందు 'ఆసీత్' అనగా ప్రజ్ఞానముగలవాడు బ్రహ్మముఖముగా ఆయెను. అనగా పొందెను అని యర్థము ప్రయోగింపబడెను గాని ఈమానవులలో నొకరు యీశరీరముతో బ్రహ్మముఖమునందు జనిం

చెననిగాదు. అయితే ఇట్లు ముఖాంగముగా దీక్షస్థానము నిరూ
పించినకారణం బేమనిన వినుఁడు.

శ్రుతి:—నీలతోయదమధ్యస్థా, విద్యుల్లేఖేవభాస్వరా,
నీవారశూకవత్తన్వీ, పీతాభాస్వత్యణూపమా
తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మావ్యవస్థితః
సబ్రహ్మసశివస్సహరిస్సేన్ద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్.

తా॥ హంసయందుగల పంచతత్త్వానుభవసారముగా
సదా భూతములకు గలుగుచున్నట్టి ప్రకృతిభ్రాంతులనే నల్ల
మేఘములయందు వడ్లగింజపై ముల్లువలె సూక్ష్మమై, పీత
వర్ణమై, అణువుతో సమానమై యున్నది. దానిశిఖామధ్య
మందు అనగా సుషుమ్నా నాళమందు పరమాత్మ యుం
న్నాడు. ఆ పరమాత్మయే బ్రహ్మయు, రుద్రుడు, విష్ణువు,
ఇంద్రుడు నాశరహితుడు, కూటస్థుడు, అన్నిటికి మూలకార
ణుడు, స్వప్రకాశుడు-

అను పరబ్రహ్మతత్వము పిపీలికాది విరాట్పురుషుని
పర్యంతము భూతములయొక్కయు, విరాట్పురుషునియొక్కయు
ముఖస్థానమే ఆత్మస్థానమై యుండుటచే ఆత్మదీక్షకులైన
బ్రహ్మయజ్ఞతత్పరు లందరును విరాట్పురుషుని ముఖముగా
నయిరి. అని పైశ్రుత్యర్థము. ఈవిషయమునుగురించియే శ్రీ
ఆంజనేయునితో ముక్తికోపనిషత్తునందు శ్రీరాముండిట్లు
నుడివెను.

శ్రుతి:—భావితం తీవ్రసంవేగా దాత్మనా యత్తదేవ సః
భవ త్యాశు కపిశ్రేష్ఠ, విగతేతరవాసనః.

తా॥ ఆంజనేయా! ఎవడు తీవ్రసంస్కారవేగము చేత ప్రకృతివాసనలు వదలినవాడై ఏ ఆత్మస్వరూపమును ధ్యానించుచున్నాడో ఆ ధ్యానించునట్టి ఆత్మయే తా నగుచున్నాడు.

అని శ్రీరాముడు నుడివినట్లుగా బ్రహ్మయజ్ఞదీక్షకు లందరును సత్యలోకస్థానంబైన విరాట్పురుషుని ముఖముగా నైరి అని శ్రుత్యర్థము. అట్లే తక్కిన మూడుపాదముల యందును ఆయా గుణకర్మలు అనగా ఈ అధ్యాయమున నిరూపించిన వ్యాసుని వాక్యానుసరణి రజోగుణస్థుడు బాహుబలముచే జీవించువాడుగనుక పరిపాలకుడు బాహువులుగా చేయబడెననియు - ఇట్లే,

శ్లో॥ ఊర్ధ్వంగచ్ఛంతి సత్త్వస్థా, మధ్యేతిష్ఠంతిరాజసాః
జఘన్యగుణవృత్తిస్థా, అధోగచ్ఛంతి తామసాః.
—భగ. 14 అ. 18 శ్లో.

తా॥ సత్వగుణప్రధానులు ఊర్ధ్వలోకమను ముఖస్థానమగు సత్యలోకమును బొందుదురు. రజోగుణప్రధానులు బాహులోకమను స్వర్గలోకము బొందుదురు. మిశ్రగుణ ప్రధాను లూరులోకమను మర్త్యలోకమును బొందుదురు.

తమోగుణప్రధానులు పాదలోకమను యమలోకమును బొందుదురు.

అనగా ఆ యా గుణప్రధానులైన మానవులు ఆ యా వృత్తిస్వరూపముతో నటించుచు ఆ యా కష్టసుఖము లనుభవించుటయే నాలుగు జాతులుగా ప్రధానములు పరిగణింపబడినవి. కనుక వారివారి గుణవృత్తి ననుసరించి ఈతడు ఫలాని జాతివాడని విజ్ఞులు నెరుంగవలయునుగాని వంశపరంపరాగాదని స్పష్టముగా శ్రుతిస్మృతేతిహాసపురాణప్రతిపాద్య సిద్ధాంతము.

ప్రజలయందు ఒకరియం దొకరికి గౌరవాదులు,లక్ష్యాదులుండగలందులకు అట్లైనను బ్రాహ్మణుడు ముఖమునందు బుట్టెననియు, క్షత్రియుడు బాహువులయందు బుట్టెననియు, వైశ్యు డూరువులయందు బుట్టెననియు, శూద్రులు పాదములయందు బుట్టెననియు పైశ్రుతి కర్థము చెప్పుకొనుచు వచ్చిరి. అట్లు చెప్పుకొనుచు వచ్చినప్పటికిని పూర్వ మీ శ్రుతిస్మృతులు బుట్టినపుడు రాజనీతి కట్టుబాటుచే ద్విజులయందు బ్రాహ్మణవర్తనానుభవము కలదు. అందువలనను ప్రజ లాయర్థము నంగీకరించుటకు గారణమైనది. అదియేగాక ఆర్యులే స్వపరిపాలకులు, ఆర్యులే కవీశ్వరులు, ఆర్యులే వేదవేత్తలు అగుటచే యీసంఘమువా రందరును ఆర్యులేయర్థమును జెప్పి యొరుల నెట్లు నడపించినను ఆ కాలమునకును, ఆస్మృతి

చట్టములకును ప్రజలు బాధ్యులై వర్తించియుండిరిగాని స్మృతు లెప్పుడును కాలానుగుణ్యముగా మారుచుండును. కనుక ప్రతియొకమానవుండును "ఆత్మబుద్ధి స్సుఖంచైవ, గురుబుద్ధి ర్విశేషతః." అను న్యాయంబున తమ ఆత్మదృష్టితో ఈలోకమున నేమిటి? ఈ లోకప్రజనులందరు సహజకర్మము లేమి జేయుచున్నారు? ప్రతియొకమానవుడును సహజముగా ఏ గుణముతో వర్తించితే ఏయే సౌఖ్యములు లభించుచున్నవి? అని ఎవరికి వారే ఆత్మబుద్ధితో తన స్వానుభూతి వర్తనయందు యోచించుకొనిన స్మృతులయొక్క తగాదా మారి కర్మలు దైవచట్టమా? మానవకృతమా? యనియు, ఈధర్మములు శాశ్వతమా? అశాశ్వతమా? అనియు మీకే గోచరించగలదు. ఆత్మదృష్టితో దైవభక్తితో యోచించుము. అట్లు గాదేని సత్యసమష్టిధర్మతత్త్వవర్తనానుభవుడైన ఒకపుణ్యాత్ముని గురువుగా నాశ్రయించి సుఖతత్వము నైన తెలిసికొనుము. అట్లు గాకున్నను స్మృతులుగూడ ఒక మానవుని జన్మస్థానాధిక్యముచేతనే ముముక్షుత్వమును బొందుననని చెప్పలేదు. ఇందుకు ప్రమాణములను వినుము.

స్మృతి:—అనధీత్య ద్విజోవేదా, ననుత్పాద్య తథాప్రజాః
అనిష్ట్వాచైవ,యజ్ఞైశ్చ,మోక్ష మిచ్ఛన్ వ్రజ త్యథః.
—మనుస్మృతి.

తా॥ ద్విజుడు వేదముల నభ్యసింపకయు, సంతాన వంతుడు గాకయు, యజ్ఞములు సేయకయు అతను మోక్షము నపేక్షించెనేని అధోలోకమునకు బోవును.

స్మృతి:—ఏషామన్యత్రిభావేన, మృషాచారో భవేద్విజః
తత్రివిద్యా నదాతవ్యా, పరుషేణ హితైషిణా.
—హారీతస్మృతి.

తా॥ సత్యాచారవ్రతాచారములేని ద్విజుడు కర్మభ్రష్టుడై శూద్రత్వమును బొందునుగనుక ఆతనికి తమ క్షేమమును గోరుకొను పండితుడు వేదమును గఱపగూడదు.

స్మృతి:-తస్మాన్న లంఘయేత్సంధ్యాం, సాయంప్రాతస్సమాహితః
ఉల్లంఘయతి యోమోహా, త్సయాతి నరకంధ్రువం.
హారీతస్మృతి.

తా॥ ఎవరు సాయంప్రాతఃకాలములయందు సదా అశ్రద్ధచేత సంధ్యను వదలగూడదు. అట్లు వదలిరేని శాశ్వతముగా నరకమున బడియుందురు.

స్మృతి:—విరక్తః ప్రవ్రజేచ్ఛీమాన్, సంరక్తస్తుగృహేవసేత్
సరాగో నరకంయాతి, ప్రవ్రజన్హి ద్విజాధమః.
—హారీత.

తా॥ బ్రహ్మవిద్య నభ్యసించు బ్రహ్మచారి తనకు అప్పుడే కేవలము వైరాగ్యము గలిగనేని అంతనుండియే సన్న్యా

సించవచ్చును. అట్లుగాక కోరికలుగలవాడు సన్యసించెనేని వాడు ద్విజాధముడై నరకమును బొందును.

శ్రుతి:—వమనాహారవర్జస్య, భాతి సర్వేషణాదిషు
తస్యాధికారో సన్యాసే, త్యక్తదేహాభిమానినః.

తా॥ వమనమైన పదార్థమునందు మానవున కెట్లు యిచ్ఛలేదో అట్లే దేహాభిమాన, కులాభిమాన, మతాభిమానములను త్యజించిన యతీశ్వరుని పూజింపవలయును. అట్లుగాక అభిమానముతో గూడుకొనిన యతిని త్యజించవలయును.

స్మృతి:—నష్టశౌచే వ్రతభ్రష్టే, విప్రే వేదవివర్జితే
దీయమానం రుదత్యన్నం, కింమయా దుష్కృతంకృతమ్
సమమబ్రాహ్మణేదానం......—బృహస్పతిస్మృతి.

తా॥ శౌచాచారములు పోగొట్టుకొనిన వ్రతభ్రష్టుడును, వేదమును కొంచెమైనను చెప్పుకొననివాడును నైన ద్విజుడు అతిథిగా వచ్చినపుడు అతని కిచ్చిన భోజనపదార్థములు నాచేత యేమి దుష్కృతము చేయబడెనో యిట్టి పాపాత్ముని గర్భమున బడవలసి వచ్చె నని దుఃఖించును. అట్టి బ్రాహ్మణుని కిచ్చిన దానముగూడ నట్లే దుఃఖించును.

స్మృతి:—ప్రతిగ్రహేణ శ్యామంతి, పావక స్సలిలైరివ
అసమ్మానా త్తపోవృద్ధిః సమ్మానా త్తపసః క్షయః.
—బృహస్పతి స్మృతి.

తా॥ ఏద్విజుడు దానము పట్టుచున్నాడో ఆతని తేజస్సు నీళ్ళుచల్లిన నిప్పువలె ఆరిపోవుచున్నది. ఎవరు దానము పట్టుటలేదో ఆతనితపస్సు వృద్ధియగుచున్నది.

స్మృతి:—ఆచారహీనం నపునంతి వేదా, యద్యప్యధీతం సహాషడ్భిరంగైః । ఛందాంసినైవ్యం మృత్యుకాలేత్యజంతి నీడం శకుంత, ఇవజాతపక్షాః॥ఆచారహీనస్యతు వేదా, షడంగాస్వఖిలాః, కాంప్రీతి ముత్పాదయితుం సమర్థా, అంధస్యదారా ఇవ దర్శనీయాః.

—వసిష్ఠస్మృతి.

తా॥ అంగములతో గూడ నధ్యయనము చేయబడినను, ఆచారహీనుని వేదములు పావనము చేయంజాలవు. రెక్కలువచ్చిన పక్షులు గూటిని విడిచినటుల ఛందస్సు మృత్యుకాలమునందు వానిని విడిచిపెట్టును. సౌందర్యవతియగు భార్య గుడ్డివాని కెటుల సంతోషము నీయంజాలదో అటులనే వేదములు, వానియంగములు, యజ్ఞములు ఆచారహీనుడగు వానికి శ్రేయస్సు నీయంజాలవు.

స్మృతి:—యస్యైతే చత్వారింశ, త్సంస్కారా నచాష్టాత్మగుణాః । న సబ్రహ్మణ స్సాయుజ్యం, సాలోక్యంచ గచ్ఛతి.  —గౌతమస్మృతి.

తా॥ వర్ణాశ్రమధర్మరూపములగు సీమంత, జాతకర్మ, నామకరణ, చౌల, ఉపనయనాదిగాగల సంస్కారములన్ని

యు బొందినప్పటికిని శాంతశమదమాదులగు అహింస, భూతదయ, ఇంద్రియనిగ్రహము, క్షమ, అనృతము లేకుండుటలను శమదమము లాదిగాగల ఆత్మగుణములగు యెనిమిది గుణము లెవనికి లేవో వానికి బ్రహ్మసాయుజ్యము గాని, సాలోక్యముగాని లభించదు.

స్మృతి:—ఆషోడశా ద్వావింశా చ్చతుర్వింశాచ్చ వత్సరాత్ । బ్రహ్మక్షత్రవిశాం, కాల ఔపనయనాదిక స్స్మృతః । అతఊర్ధ్వం, పతంత్యేతే, సర్వధర్మబహిష్కృతాః । సావిత్రీ పతితా వ్రాత్య వ్రాత్యస్తోమాదృతే క్రతోః॥ —యాజ్ఞవల్క్యవచనము.

తా॥ అనగా బ్రహ్మక్షత్రియవైశ్యులకు క్రమముగా 16, 20, 24 వత్సరములలోపల ఉపనయనము పొందని త్రైవర్ణికులు గాయత్రీభ్రష్టులై వ్రాత్యు లనబడుదురు. అనగా పతితులగుదురు. కనుక వారిని సర్వకర్మములనుండి బహిష్కృతి యొనర్చవలయును. అని ఇత్యాది శ్రుతి, స్మృతిప్రమాణములు ఇహ, పరసాధనకార్యములకు సత్యాది గుణములవలననే సంపాదనపరికరములుగా విధించియుండెను. ఇక నవియన్నియు గ్రంథవిస్తరభీతిచే వదలివేయుచున్నాడను.

కనుక సర్వసుజనులారా! మానవుడు ఏజాతిలో పుట్టినను అంతనుండి మరల వారివారి గుణవర్తనప్రధానముల ననుసరించి పై శ్రుత్యభిప్రాయప్రకారము బ్రాహ్మణుడు తామసాంశంబైన జీవహింసాది కార్యములకు లోబడినప్పుడు

అతడు శూద్రకులములో బ్రదికియుండగనే పుట్టె నని ఆతనిని సర్వులు గౌరవించక వదలివేయవలయును.

నామకార్థమైన శూద్రకులజుడైనను ఆతనియందు సద్గుణగరిష్ఠత్వము గలిగిన బ్రహ్మతత్త్వానుభవము గలిగి యుండెనేని అతడు జీవించియుండగానే బ్రాహ్మణుడుగ జనించుచున్నాడు. కనుక ఆతడు సర్వవిధుల గౌరవించి పూజించదగినవాడు. అయితే యింతమాత్రమునకే యిదివరలో పరంపరగా వచ్చుచున్నటువంటి ద్విజవంశీయులతో కలిసి భుజించదగినవాడా యని మీరు ప్రశ్న చేయ నవశ్యము లేదు. మీకు ముందు సోపానమున భుజించ తగినవాడు, స్వధర్మము లాచరించదగినవాడు, ఉపనిషత్తులు పఠింపదగినవాడు అను సర్వశాస్త్రదృష్టాంతప్రమాణములను వ్రాయుచున్నాడను. సక్రమముగా గ్రహించునది. వాదభేదములు వదలవలసినది. నేనిపుడు వ్రాయు గ్రంథము సర్వఋషుల యభిప్రాయము గాని ఒకరి స్వంత ప్రోక్తము కాదనియు తలంచి సర్వజనులు ఆత్మదృష్టితో సమష్టిభావనతో, దైవభక్తి, గురుభక్తితో ఇహాపరసౌఖ్యసాధనభూతంబగు నివృత్తికర్మమార్గమున వర్తించుచు శ్రీమన్నారాయణుని కృపాకటాక్షములకు పాత్రులరై సుఖింతురు గాక.

ఇది శ్రీమన్నారాయణవరప్రసాదలబ్ధకవితావిలాస శ్రీ వేంకటకృష్ణదాసప్రణీతంబైన జాతీయధర్మతత్త్వరహస్యమునందు గల బ్రాహ్మణతత్వస్వరూపనిర్ణయ మను నాలుగవ ఆశ్వాసము సర్వము సమాప్తము.

ఓమ్

శ్రీ గురుభ్యో నమః

# జాతీయసమష్టిధర్మతత్త్వరహస్యము

పంచమాశ్వాసము.

## సర్వజనసమష్టి ధర్మాచరణవిధి.

శ్లో॥ "చతుర్ణామపి వర్ణానాం, యాని ప్రోక్తాని శ్రేయసే
ధర్మశాస్త్రాణి రాజేంద్ర, శృణుతాని నృపోత్తమ
విశేషతస్తు శూద్రాణాం, పావనాని మనీషిభిః
అష్టాదశపురాణాని, చరితం రాఘవస్యచ."

—భవిష్యత్ పురాణము.

తా॥ ఓ రాజేంద్రా, నాలుగువర్ణములవారికిని, శ్రేయస్సుగలుగుటకుగాను ధర్మశాస్త్రములు విద్వాంసులచే జేయబడినవి. అందు శూద్రులకు మిక్కిలి పావనములైనవి యేవేవియనగా పదునెనిమిది పురాణములును, రామాయణమును అని అర్థము. (ఇట్లే మరియొకస్థలమునందు.)

శ్లో॥ "సిద్ధాంతశ్రవణం ప్రాహ ద్విజానాం, మునిసత్తమాః
శూద్రాణాంచ విరక్తానాం, తథా స్త్రీణాం మహామునే
సిద్ధాంతశ్రవణం ప్రోక్తం, పురాణశ్రవణం బుధైః."

తా॥ అనగా ద్విజులకును విరక్తులైన శూద్రులకును ఆర్ట్ర స్త్రీలకును పురాణము వినుటచే స్మృత్యర్థమంతయు తెలియవచ్చునని ముని శ్రేష్ఠులందురు. (అనగా యిచ్చట ప్రథమోపదేశము స్త్రీ పురుషులగు చాతుర్వర్ణ్యములవారును, పురాణములవలననే సర్వధర్మములు గ్రహించ నగునని యభిప్రాయము.) ఇట్లు వాయవీయమందు,

"శ్లో॥ ఏతాని నృపశార్దూల ధర్మశాస్త్రాణి పండితైః
సాధారణాని ప్రోక్తాని, వర్ణానాం శ్రేయసే సదా
చతుర్ణా మిహ రాజేంద్ర, శ్రోతుమర్హాణిసువ్రత."

తా॥ అనగా సువ్రతుడైన రాజేంద్రా; యీ ధర్మశాస్త్రము లన్నియు సర్వసాధారణములై శ్రేయస్సునుగలుగ జేయునని పండితులచే జెప్పబడినవి. అందువలన చాతుర్వర్ణ్యముల వారును వినదగుదురు.

ఇక చాతుర్వర్ణ్యములవారికి పురాణపఠనాధికారమును వినుడు.

శ్లో॥ పఠన్ ద్విజో వాగృషభత్వమీయాత్
స్యాత్ క్షత్రియో భూమిపతిత్వ మీయాత్
వణిగ్జనః పణ్యఫలత్వ మీయాత్
జనశ్చ శూద్రోఽపి మహత్వ మీయాత్॥

—రామాయణము

తా॥ అనగా యీ రామాయణమును పఠించి ద్విజుడు వక్తలలో శ్రేష్ఠు డగును. క్షత్రియుడు భూపతియగును. వైశ్యుడు పణ్యఫలమును బొందును. శూద్రుడు మహాత్వమును బొందును. ఇట్లు రామాయణ పఠనాధికారము చాతుర్వర్ణ్యము లవారికి చెప్పియుండుటవలనను ప్రథమమున పదునాలుగు పురాణములను రామాయణమును, సర్వజనులు వినుట కెట్లధి కారము గల దని నుడివియుండెనో అట్లే సర్వపురాణపఠనాధి కారము చాతుర్వర్ణ్యములవారికి కల దని యెరుంగునది. ఇందు వలననే సూతుడు సర్వపురాణబోధాధికారిత్వము వహించి నిర్వహించె నని సర్వులు గ్రహించునది.

సర్వజన సమష్టిపంచయజ్ఞవిధానము వినుఁడు.

గీ॥ యజ్ఞపంచక మామ్నాయమందు జెప్ప
బడియె నరులకు శ్రద్ధచే వాని నాచ
రించు మానవులకు బలసంచయములు
గలుగు నొనరింపకున్న బాములు పొసంగు.

—బహ్మం. ద్వి॥ ప్ర॥ శ్వా. 722 పద్యం.

తా॥ అనగా, ప్రతిరోజును పంచయజ్ఞములు ప్రతి మానవుం డాచరించుచుండవలయునని వేదవిధియై యున్నది. అట్లు ఆచరించుమానవులు ఇహపరసౌఖ్యములు పొందుదురు. అట్లు పంచయజ్ఞము లాచరించనివారు పాపములను బొందు దురు. (ఈవిషయమును గురించి వ్యాసవచనము. "పంచయజ్ఞ

విధానంతు, గృహీ నిత్యం నహాపయేత్" అనగా ప్రతియొక గృహస్థుడు, నిత్యము పంచయజ్ఞములు ప్రతిదివస మాచరించుచుండవలయు నని వ్యాసమహర్షి నుడివెను. ఈవిషయమును గురించియే,

"దానంచ దద్యాచ్ఛూద్రోఽపి, పాకయజ్ఞై ర్యజేతచ,
పిత్ర్యాదికంచవై సర్వం శూద్రః కుర్వీతవై నరః.
—దేవలవచనము.

"భార్యారత శ్శుచిర్భృత్య, భర్తా శ్రాద్ధక్రియారతః
నమస్కారేణ మంత్రేణ, పంచయజ్ఞా న్నహాపయేత్.
—యాజ్ఞవల్క్య వచనము.

తా॥ అనగా శూద్రుడు దానములీయవచ్చును. పంచయజ్ఞము లాచరించ వచ్చును. పిత్రాదికర్మలు సర్వము జేయవచ్చును.

శూద్రుడు భార్యయందే తత్పరుడై శుద్ధికలిగి భృత్యులను పోషించుచు శ్రాద్ధక్రియలయం దాసక్తుడై నమస్కార మంత్రములచే అనగా, (ఇంద్రాయస్వాహా) అనుశబ్దమునకు బదులుగా (ఇంద్రాయ నమః) అని మంత్రముచ్చరించుచు పంచయజ్ఞము లాచరించవలయు నని యాజ్ఞవల్క్యుడు వచించెను.)

(పిండవిధానమునుగురించి సర్వజనసమష్టి వినుడు.)

శూద్రిస్తు గృహపాకేన, తత్పిండా నిర్వపేత్తథా
సక్తుమూలఫలం తస్యా, పాయసంవా భవేత్ స్మృతం.

—భవిష్యద్వచనము.

తా॥ అనగా శూద్రుడు గృహపక్వాన్నముచేతనే పిండము లీయవచ్చును. అట్లు సక్తుపిండిచేతనైనను ఫలమూలములు పాయసముచేతనైనను నీయవచ్చును.

(సప్తసంతానప్రతిష్ఠనుగురించి సర్వజనసమష్టి వినుడు)

"అధికారీభవే చ్ఛూద్రః పూర్తధర్మేన వైదికే."

(వ్యాసవచనము)

అనగా పూర్తవైదికధర్మము శూద్రు డాచరించ నధికారి యనియు నుడివిన వ్యాసవాక్యానుసరణి

"వాపీకూపతటాకాది దేవతాయతనానిచ
అన్నప్రదాన మారామః పూర్త మిత్యభిధీయతే."

—జాతుకర్ణ్యవచనము

తా॥అనగా శూద్రుడు వైదికసంబంధమగు పూర్తధర్మము లాచరించ నధికారి యనియు అవి యేవేవియనగా చెరువు వేయించుట బావిత్రవ్వించుట దేవతాప్రతిష్ఠచేయుట సత్రము బెట్టించుట వనమువేయించుట (ధనప్రతిష్ఠ- ధర్మప్రతిష్ఠ) ఆచరించవలయు నని నుడివెను.

(భగవత్ప్రతిష్ఠనుగురించి సర్వజనసమష్టి వినుడు.)

"చతుర్వర్ణై స్తథావిష్ణుః ప్రతిష్ఠాప్యసుఖార్థిభిః
భైరవోపి చతుర్వర్ణైరంత్యజానాం తథామతః
మాతర స్సర్వలోకైస్తు స్థాప్యాః పూజ్యాస్సురోత్తమాః
లింగంగృహీయతిర్వాపిసంస్థాప్యతు యజేత్సదా.

తా॥ అనగా విష్ణుప్రతిమను నాల్గువర్ణములవారును సుఖముగోరి ప్రతిష్ఠింపవచ్చును. భైరవప్రతిమను నాల్గువర్ణములవారును, చండాలురు సహితము స్థాపించవచ్చును. సప్తమాతృకలమూర్తులు సర్వలోకులు బ్రతిష్ఠింపవచ్చును. పూజింపవచ్చును. శివలింగమును గృహస్థుడుగాని సన్యాసిగాని స్థాపించి పూజింపవచ్చును. (అని దేవీపురాణము)

(మోక్షమార్గ విచారణనుగురించి సర్వజనసమష్టి వినుడు)

శ్రీరాముడు అరణ్యపర్వమున జానకిని నెడబాసి దుఃఖితుడై యున్నవేళ రామున కీశ్వరుడు ప్రసన్నుడై శివగీతను బోధించగా రాముడు సంతసించి యిట్లనియె.

శ్లో॥ భగవన్ మోక్షమార్గోఽయంత్వయాసమ్య గుదాహృతః
తత్రాధికారిణం బ్రూహి తత్ర మే సంశయో మహాన్.
—శివగీత. 16 అ. 1 వ శ్లో.

తా॥ భగవంతుడా, మోక్షమార్గము నీచేత లెస్సగా నాకు నెరింగింపబడినది. అందు మోక్షాధికారి యెవ్వడో,

వారి విషయమును జెప్పి సంశయమును దీర్పు మని శ్రీరాముం డడుగ శివుం డిట్లనియె.

శ్లో॥ బ్రహ్మక్షత్రవిశశ్శూద్రాః స్త్రియ శ్చాత్రాధికారిణః
బ్రహ్మచారీ గృహస్థోవాఽనుపనీతో ఽథవా ద్విజః.
—శివగీత.

తా॥ బ్రాహ్మణ క్షత్రియ వైశ్య స్త్రీ శూద్రులును గృహస్థ, వానప్రస్థ, అనుపనీతులగు ద్విజులతో సహా అందరికిని బ్రహ్మవిద్య పొందుట కధికారముగల దని యీశ్వరుండు నుడివెను. (తదనుగుణముగా రమణగీత యిట్లు వచించెను.)

"శ్లో॥ బ్రహ్మచారీ గృహస్థోవా, వానప్రస్థోఽథవా యతిః
నారీవా వృషలోవాపి, పక్వోబ్రహ్మ విచారయేత్."

తా॥ బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థ యతి స్త్రీ శూద్రులాదిగాగలవార లెవ్వరైనను, మనోపక్వమైనపుడు బ్రహ్మవిచారణ చేయదగుదురు. ఇట్లు అనేకప్రమాణములు గలవుగాని గ్రంథ విస్తరభీతిచే సర్వజనసమష్టిని గురించి చెప్పెడు విధానమును గురించి, అన్ని అధికారములను గురించి, ఒక్కొక్కదానికి ఒకటి రెండు సాక్ష్యములు మాత్రమే తెలివిగలవారు గ్రహించునట్లుగా యిందు పొందుపరచినాను. కనుక మరిన్ని సాక్ష్యములు లేవని సందేహించవల దని బుధజనవినుతి. ఎందుల కనగా గుణప్రధానము దప్ప

జాతిపరిధానము లేదని చతుర్థాశ్వాసమున దెలియపరచి యున్నానుకదా!

{ మోక్షమార్గమునకు ద్వితీయసోపానమగు భక్తి యోగమును గురించి సర్వజనసమష్టి వినుడు. }

శ్లో॥ స్త్రీత్వే పుంస్త్వే విశేషోవా జాతినామాశ్రిమాదయః
నకారణం మద్భజనే భక్తిరేవహి కారణం.
—అధ్యాత్మరామాయణమ్. 10 సర్గ.

తా॥ మద్భక్తిచే తరించుటకు స్త్రీలనియు పురుషులనియు నపుంసకులనియు గొప్పవారనియు కొద్దివారనియు జాతినామ ఆశ్రిమములతో నవశ్యము లేదు. నాయందు భక్తి యెవరికి కలదో వారలందరిని రక్షించెద నని శ్రీరాముండు శబరితో నుడివెను. మరియు.

శ్లో॥ మాంహి పార్థ వ్యపాశ్రిత్య యేపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యాస్తథాశూద్రా స్తేఽపియాంతిపరాంగతిమ్.
—భగవద్గీత అ 9. శ్లో 32.

తా॥ అర్జునా యెవ్వరైనను నీచజన్మము గలవారలగుదురు గాక! అట్టివారును, స్త్రీలు వైశ్యులు శూద్రులు మొదలగు వీరందరును నన్ను సేవించిన మోక్షమును పొందుదురు.

అట్లే ఈశ్వరుని వాగ్దానము, సమస్తజనరక్షణ వినుడు.

శ్లో॥ అధ రుద్రో మహాదేవో, మండలస్థ ఉవాచహ
పూజ్యోహం బ్రాహ్మణానాంచ, క్షత్రియాణాం విశేషతః

వైశ్యానాంచైవ శూద్రాణాం, శుశ్రూష్యః పూజకస్యచ
స్త్రీణాంచైవాధికారోస్తి, పూజాదిషు న సంశయః.

—లైంగపురాణము.

తా॥ అనగా మహాదేవుడు రుద్రుడు మండలమందుం డియే యిట్లు పలుకుచున్నాఁడు. నేను బ్రాహ్మక్షత్రియ వైశ్య శూద్రులచే పూజింపబడుదును. అర్చకులచే నర్చింపబడు దును. స్త్రీలకుగూడా నాపూజయం దధికారము గలదు. సం శయము లేదు.

శ్లో॥ యస్తుపూజయతే లింగం, దేవాదిం మాం జగత్పతిం
బ్రాహ్మణఃక్షత్రియోవైశ్యశ్శూద్రోవామత్పరాయణః
తస్యప్రీతఃప్రదాస్యామి, శుభాఁల్లోకానను త్తమాన్.

—భవిష్యద్వచనము.

తా॥ అనగా ఈశ్వరుడు మరల భవిష్యత్పురాణము నందు నిట్లు నుడివెను.—దేవతలకాదియు జగదధిపతియు నగు నన్ను లింగరూపమునందు పూజించువాడు బ్రాహ్మణక్షత్రి యవైశ్యశూద్రులలో నెవ్వడైనను నేను వానికి ప్రీతుడనై శుభమైన యుత్తమలోకము నిచ్చెదను. అని నుడువుటయేగాక ప్రత్యక్షప్రమాణముగా కాశీ శ్రీశైలాదిగా గల క్షేత్రములలో సర్వజనుల సమష్టితో సమానముగా నర్చింపబడు చుండెను. ఇంతియేగాక మరియొకచోట మరియొకవిశేషము గూడా జెప్పియుండెను.

శ్లో॥ అథశూద్రస్య వక్ష్యామి, గదత శ్శృణు మాధవి
దంపతీ మమభక్తౌచ, మమకర్మపరాయణౌ
నమస్కారప్రియో నిత్యం, మమచింతా వ్యవస్థితః
శుద్ధ కర్మాణి వై దేవి, యో నిత్యంతు సమాచరేత్
త్యక్త్వా ఋషిసహస్రాణి, శూద్రసేవతుయామ్యహం.

తా॥ అనగా శూద్రునకు దీక్షజెప్పెదను వినుము పార్వతీ! భార్యాభర్తలిరువురును నాయందు భక్తిగలవారలై నన్ను నుద్దేశించి వ్రతములు సేయుచు, నెల్లప్పుడు నన్నుధ్యానించి నమస్కరింపుచు, శౌచాచారపరుండై యుండెనేని వేల కొలంది ఋషులు నాకొరకు కనిపెట్టుకొని యున్నను వారిని విడిచి, ఆశూద్రునకే ముందు సాక్షాత్కరింతునని ఈశ్వరుడు పార్వతితో నుడివెను. ఇట్టివిషయమును గురించి చెప్పుటలో వామనపురాణమునందు "తతశ్చకార భగవాన్ చాతుర్వర్ణ్యాం, మహార్చనే" అనగా చాతుర్వర్ణములవారును ఈశ్వరుని పూజకొరకే సృజింపబడి రని వసిష్ఠపుత్రుడగు శక్తి యతని శిష్యుల కుపదేశించెను. కనుక ప్రపంచములో పుట్టి నట్టువంటి ప్రతియొకమానవుండును శ్రీ భగవంతుని సేవా పూజానమస్కారములకు సమానులై యుండుచు, ఈ సర్వ ప్రజలలో సద్గుణగరిష్ఠుండై సర్వేశ్వరుని నిష్కామభక్తుండైన పుణ్యాత్ముండు మాత్రమే అందరిచేతను పూజింపదగినవాడై అందరికంటె శ్రేష్ఠుం డనబరగును. అంతియేకాని కులజా

త్యాదిసంస్కారముల బొందినంతమాత్రమున నే గుణము లేని యొక మానవుం డొరులచే పూజింపబడడు. కనుక అన్ని విధములకును సర్వేశ్వరుడగుజగత్కర్తను మాత్రమే సర్వు లు నాశ్రయించి యిహపర సౌఖ్యంబులు బొందనగును. ఇందులకే—

శ్లో॥ బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః స్త్రియశ్శూద్రాంత్యజాతయః । సంపూజ్య తం సురశ్రేష్ఠం నరసింహవపుర్ధరం। ముచ్యంతే చాశుభైర్ఘోరై ర్జన్మకోటిసముద్భవైః.

—నరసింహపురాణము.

తా॥ అనగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య స్త్రీశూద్రు లను వారును, అంత్యజాతు లను వారును శ్రీ నరసింహా కారము దాల్చిన దేవశ్రేష్ఠుండగు శ్రీమన్నారాయణుని పూజించిన కోటి జన్మముల పాపములను బోగొట్టుకొని బంధ విముక్తులై మోక్షమును బొందుదురు. (అని నుడువుటయేగాక ప్రత్యక్షప్రమాణముగా జగన్నాథమాదిగాగల పుణ్యక్షేత్ర ములయందు స్త్రీ శూద్రాదిగాగల సర్వజనులతో సమాన ముగా శ్రీమహావిష్ణు వర్చింపబడుచుండెను.)

కనుక సర్వసుజనులారా! నా ఆత్మప్రియులారా! కొన్ని తామస ఋషిప్రోక్తముల యందు శూద్రు లనువారు వేరుగా నొకజాతి కలదనిన్ని వారు ఏకర్మా చరణార్హులు కారనియు భగవంతుని పూజించుటకు తగ

రనియు వారు ఈలోకములో నామకార్థ బ్రాహ్మణులను బూ
జించియే కడతేర వలయుననియు చెప్పిన గ్రంథములను అట్లు
వ్యష్టిగా చెప్పెడి మానవులను ఎవ్వరు దగ్గరకు చేర్చుకొనక
విసర్జించి ఏమానవుడైనను స్వాత్మారాధనము గలిగి సజ్జన
భావ సమిష్టితత్త్వమును నెరిగిబోధించుచుండునో అట్టి మానవు
డేజాతివాడైనను అతనిని పూజించి గౌరవించువారలే యిహ
పరసౌఖ్యసాధనములు బొందగలవారలు. ఎందువలననగా

శ్లో॥ ఆత్మాన మీశ్వరం వేద సోతివర్ణాశ్రమీ భవేత్
యో వస్థాత్రయనిర్ముక్తం అవస్థా సాక్షిణం సదా
యస్యవర్ణాశ్రమాచారో గళితః స్వాత్మదర్శనాత్
సహివర్ణాశ్రమాన్ సర్వా నతీత్య స్వాత్మ నిస్థితః.
—దత్తాత్రేయోపనిషత్.

తా॥ ఎవడు జాగ్రత స్వప్న సుషుప్తులకు సాక్షిగా
నుండువాడై తన యాత్మయగు ఈశ్వరుని తెలిసికొని, సదా
జాతివర్ణాశ్రమములకు పైగానుండు ఆత్మస్వరూపుడే తానని
దృఢబోధ గలిగియుండువా డేజాతివాడైనను అన్నివర్ణముల
వారిలో శ్రేష్ఠుడైనవా డనబరగును. మరియుఎవనికి ఆత్మదర్శన
మువల్లవర్ణాశ్రమాచారభ్రాంతినుండివిడుదల గలిగి యున్నా
డో వాడువర్ణాశ్రమములగు వ్యష్టిభావనగల సర్వమును వద
లినవాడై ఆత్మవేత్తై యున్నాడని తెలిసికొని ఆత్మాకారుడై
యుండుటయే జాతి శ్రేష్ఠత్వ మని చెప్పబడెను. (కనుక అన్ని

ధర్మములకు సర్వజనులు ఆచరణార్హులని వేదసమ్మతమగు సిద్ధాంతము.)

ఇక యోగాభ్యాస సర్వజనసమష్టిని వినుడు.

స్మృతి:—యోగాభ్యాస రతశ్శాంతః పరబ్రహ్మాధిగచ్ఛతి
బ్రాహ్మణక్షత్రియవిశాం స్త్రీశూద్రాణాం చ పావనం.
—యాజ్ఞవల్క్యస్మృతి.

అనగా యోగ మభ్యసించి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రు లెవ్వరైనను శుద్ధశాంతస్వరూపులై పరబ్రహ్మతత్త్వమును బొందుదురు.

స్మృ:—యచ్ఛ్రేయః సర్వభూతానాం స్త్రీణామప్యుపకారకం
అపికీటపతంగానాం తన్నః శ్రేయః పరంవద
ఇత్యుక్తః కపిలః పూర్వం దేవై ర్దేవర్షిభి స్తథా
యోగఏవ పరం శ్రేయ స్తేషామిత్యుక్తవాన్ పురా.
—కపిలమహర్షి వాక్యము.

తా॥ మున్ను దేవతల చేతను మహర్షుల చేతను ప్రార్థింపబడినవారై మహాత్మా సర్వులకు దేనివలన శ్రేయస్సు గలుగునని అడుగబడి, కపిలమహర్షి యిట్లనియె. స్త్రీలు ఆదిగాగల సర్వులకును యోగమే శ్రేయస్సును గలుగజేయును అని నుడివెను. కనుక బుద్ధిమంతులగు సర్వజాతులవారును తన బలముకొలది అష్టాంగాదిగాగల యోగములలో తన కిట్టి

మయినట్టి యోగమును సద్గురువువలన నభ్యసించి, పరతత్వా నుభవమును బొందగల రని మానమ్మకము.

మంత్రానుష్ఠాన క్రమమునుగురించి సర్వజనసమష్టివినుడు.

శ్లో॥ "జలంనయేషాం తులసీవిమిశ్రం పాదోదకంచక్రశిలాస ముద్భవం। నిత్యం త్రిసంధ్యం ప్లవతేనగాత్రం ఖగేంద్ర తే ధర్మ బహిష్కృతా నరాః.

—గారుడపురాణము.

తా॥ ఏమనుష్యుడు త్రికాలములయందు సంధ్యావంద నము (అనగా భగవంతుని మంత్రానుష్ఠానము) చేసికొని యు భగవంతుని అభిషేకించినటువంటి తులసీమిశ్రమైన చక్రశిలాభగవంతుని పాదోదకము పుచ్చుకొనడో ఆమాన వుడు సర్వకర్మలనుండి బహిష్కృతి యొనర్చదగినవాడు. ఇట్టి భగవంతుని ఉపాసించువారికి మడి మైలలు పట్టె దోవతుల ధారణ యుండవలయు నని యేమిసిద్ధాంతము లేదు.

స్మృ:—అపవిత్రఃపవిత్రోవాసర్వావస్థాంగతోపివా యస్స్మరేత్ పుండరీకాక్షం సబాహ్యాభ్యంతరశ్శుచిః.

తా॥ మానవుడు సూతకాది అశుచిలోనుండి గాని స్నానాదిక్రియలులేకగాని భగవంతుని ప్రార్థించునెడల రెండు పర్యాయములుపుండరీకాక్ష పుండరీకాక్షఅని ఉచ్చరించినంతనే అంతర్బహిశ్శుద్ధియు ఆమానవునకు గలుగును. ఇట్లు ఆహ్నిక దీపమందు గూడా వచించెను.

శ్లో॥ "సూతకే మృతకేవాపి ఆశౌచం నైవ విద్యతే
ఏషాం పాదోదకం మూర్ధ్ని ప్రాశనం యేచ కుర్వతే."

తా॥ అనగా విష్ణుపాదోదకమును ద్రావి శిరస్సునధరించువారికి జాతాశౌచమృతాశౌచములు సహితలేక శుద్ధుడగుననుట.

శ్లో॥ "దేహశ్శుద్ధ్యతి చాప్యాత్మా పీత్వాపాదోదకం హరేః
నిత్యే నైమిత్తికే కామ్యే పీత్వాభుక్త్వా నదుష్యతి."

—స్మృత్యర్థసారము.

తా॥ అనగా హరిపాదోదకము ద్రావినచో దేహము నాత్మయుశుద్ధినొందును. నిత్యనైమిత్తిక కర్మలందు విష్ణుపాదోదకము ద్రావి యనంతరము భుజించినను దోషములేదనుట.

శ్లో॥ "విష్ణు పాదోదకం పీత్వా పశ్చాదశుచిశంకయా
యశ్చాచామతి సంమోహా ద్బ్రహ్మహత్యాం సవిందతి."

—విష్ణురహస్యము.

తా॥ అనగా హరిపాద తీర్థము పుచ్చుకున్న యనంతరము—ఆచమింపనిచో అశుచినగుదునను సందేహముచే—ఆచమనముచేయు నజ్ఞుడు బ్రహ్మహత్య నొందుననుట.

శ్లో॥ గంగాప్రయాగగయపుష్కరనైమిశాని
పుణ్యానియాని కురుజాంగలయామునాని
కాలేనతీర్థ సలిలం వినిహంతితేషాం
పాదోదకం భగతస్తు పునాతి సద్యః.

బ్రహ్మాచారీ సవ్రతీచ ఆశ్రమేచసదాశుచిః
విష్ణుపాదోదకంయస్యముఖే శిరసి విగ్రహే.

—నృసింహపురాణము.

తా॥ అనగా గంగాప్రయాగ గయపుష్కరము నైమి
షము మొదలగు కురుజాంగలయామున క్షేత్రము లందలి
ర్థ జలము చిరకాలము సేవించి అనగా స్నానపానాదు
లాచరించినగాని మానవుని పావనము సేయంజాలవు. విష్ణు
పాదోదకముఅప్పుడేపావనముసేయును. విష్ణుపాదోదకము శిర
స్సనందు ప్రోక్షించుకొని లోపలకు గ్రహించినచో బ్రహ్మ
చారికి వ్రతసాఫల్యమగును; గృహస్థునికి సదాశుద్ధియు గలుగు
నుట.

కనుక సర్వసుజనులారా! మీరుస్నానము లాచరించు
పుడును, తీర్థము పుచ్చుకొనునపుడును, ఈదిగువ మంత్ర
మును పఠించి స్నానపానాదులు చేసినచో అంతర్బహిశ్శుద్ధి
గలుగును.

“సాలగ్రామశిలావారి పాపహారివిశేషతః
ఆజన్మకృతపాపానాం పాయశ్చిత్తం దినేదినే
అకాలమృత్యుహరణం సర్వవ్యాధి నివారణం
సమస్తపాపక్షయకరం శ్రీవిష్ణు పాదోదకం పావనంశుభం”

అను యీ మంత్రమును పఠించుచు స్నానపానాదు
లాచరించిన చాలును. వేరేమీకు అశుచిగలదని భగవన్మం

త్రము పఠించునపుడును భగవత్కైంకర్యము లాచరించు నపుడును బుధుల పూజించునపుడును మడిమైలలు సందేహము రవ్వంతైనను నుండకూడదు. అట్లుండువారి మనస్సు అంధత్వములోనున్నదని ఎరుంగునది. ఇక భగవన్మంత్రమును సర్వజనులు పఠించి యిహపరసౌఖ్యంబు లనుభవించవలయునవెడి వేదవాక్య నివేదికను వినుడు.

నారాయణ మంత్రం - సర్వజన పఠనాధికారం.

శ్రు:—ఓమిత్యగ్రేవ్యాహరేత్ నమఇతిపశ్చాత్ నారాయణా యేత్యుపరిష్టాత్ ఓమిత్యేకాక్షరం నమఇతిద్వే అక్షరే నారాయణాయేతిపంచాక్షరాణిపతద్వై నారాయణస్యా ష్టాక్షరంపదం యోహవై నారాయణస్యాష్టాక్షరం పదమ ధ్యేతిఅనుపబ్రువంత్సర్వమాయురేతి విందతే ప్రాజాప త్యంరాయస్పోషం గౌపత్యంతతోఽమృతత్వ మశ్నుతే తతోఽమృతత్వ మశ్నుతఇతి ఏత త్సామవేదశిరోధితే

—సామవేదోపనిషత్.

తా॥ మొదట (ఓమ్) అనియు తర్వాత (నమః) అనియు పిదుపరి (నారాయణాయ) అనియు మంత్ర ముచ్చరించవలయును. ఓమ్ అనునది ఒకఅక్షరము. నమః అనునది రెండక్షరములు, నారాయణాయ అనునది ఐదక్షరములు, ఇదే నారాయణాష్టాక్షరీ మంత్రమనంబడును. ఈ మంత్రమును యేమానవుడు సదా అనుష్ఠానమునందు (ప్రతిదివసము) ఉపాసన

చేయునో అనగా జపించుచుండునో వాడు సంపూర్ణాయు ష్మంతుడగును. ప్రజలకు అధిపతియగును. రాజభోగము ననుభవించును. పశువులకు యజమానియగును. (అనగా తెలియని మానవులకు బోధించుటకు గురువగునని యర్థము). వాడు తుదపరి మోక్షమును బొందును. ఇట్లు సామవేదోపనిషత్ చెప్పుచున్నది. దీని ననుసరించియే,

శ్లో॥ హేమర్త్యాః పరమం హితంశ్రృణుతవో వక్ష్యామిసంక్షేపతః
సంసారార్ణవ మాపదూర్మిబహులం సమ్యక్ప్రవిశ్యస్థితాః
నానాజ్ఞాన మపాస్య చేతసి నమో నారాయణాయేత్యముం
మంత్రం సప్రణవం ప్రణామసహితం ప్రావర్త యధ్వం
ముహుః.

—ముకుందమాల 17 శ్లోకము.

తా॥ ఆపదలనెడి యలలచే బహుళముగా సంసార సముద్రమునుబొంది దుఃఖితులై యున్న ఓప్రజలారా! మీకు నొక్క సుఖమును గలిగించుగట్టి మార్గహితమును సంగ్రహముగా చెప్పెదవినుడు. మీరు నానావిధములైన అజ్ఞానమును వదలి మనసునందు సదా ఓంకారముతో గూడిన నారాయణ మంత్రమును మాటిమాటికి స్మరింపుడు. అనియిట్లు సర్వజనులు కడతేరుటకు ప్రణవయుక్తమైన నారాయణమంత్రమే "విష్ణుః పోతో నరాణాం" అనగా యీ సంసారసముద్రమునందు మునిగియున్న మానవులను దాటించుటకు నారాయణమంత్రమే

పడవయగుననియు ఆమంత్రములు ధరించినవారలు యిహాపర సౌఖ్యంబు లనుభవించుట కేలాటి సందియము లేదు గనుక నే శ్రీరామానుజులవారు యథార్థమైన అభిప్రాయము ను సత్య సమష్టినిబూని సర్వభూతహితదయతో లోకోపకారార్థము శ్రీమన్నారాయణమంత్రమును ప్రణవయుక్తముగా పంచము లాదిగాగల సర్వులకును బోధించి, సర్వజనులకు గురుపీఠస్థా నాధికారమును గూడా నొసంగెను. కనుక సుజనులైన నాసో దరీసోదరులారా! మీకు యీ మంత్రపఠనాధికారము లేదని వ్యష్టిగా బల్కెడి మాయకులమాటలు విని భయంబుచే కోలు పోవక నిరంతరంబు శుద్ధసత్త్వప్రధానమగు శాంతశమదమాది గుణవర్తన భూతదయగల వారలై శ్రీమన్నారాయణ మం త్రము, సత్యసంధుడైన సద్గురువువలన దెలుసుకొని సదా పఠించుచు యిహాపరసౌఖ్యంబు లనుభవించుడు.

శ్రీ రామమంత్రపఠనాధికారము సర్వజనసమష్టి వినుడు.

శ్రు॥ రామఏవపరం బ్రహ్మ, రామఏవపరం తపః
రామఏవపరంతత్త్వం, శ్రీరామో బ్రహ్మతారకం.
—రామ రహస్యోపనిషత్.

తా॥ శ్రీరాముడే పరబ్రహ్మస్వరూపము. శ్రీరాము డే పరమతపప్రభావము. శ్రీరాముడె పరతత్త్వస్వరూపము. అట్టి శ్రీరామమంత్రమే సంసారసాగరమును తరింపజేసి ముక్తిని బొందించునట్టి మూలము (అట్టిమంత్రము)

శ్రు:—తారక త్వత్తారకో భవతి ... ... ... ... జన్మ
జరామరణసంసారమహాభయాత్సంతారయతీతితస్మాదు
చ్యతే షడక్షరం తారకమితి ...

తా॥ ఆరక్షరములుగలది శ్రీరామతారక షడక్షరీ మంత్రమనంబడును. ఇది మానవుని మహాభయంకరమగు సంసారసాగరమునుండి తరింపజేయునట్టిది గనుక తారక మంత్రమని చెప్పబడెను. ఇట్టి మంత్రమును పఠించుటకు (మంత్రము) శ్రీరామాయనమః అనియును, యింకా విశేష ముకొరకు (శ్రీరామరామాయనమః) అనియును, జ్ఞానులు చ్చరించు చుందురు. అందుకు బదులుగా యీశ్వరుడు సీతా రామాంజనేయమునందు పార్వతితో శ్రీరామరామ రామేతి అను మంత్రమును పఠించువారికి సర్వసౌఖ్యములు కలుగునని చెప్పుచు, యిట్టి మంత్రపఠనాధికారము. ఎవ్వరికి కలదనిన—

సీ॥ ద్విజవరేణ్యులకును విప్రోత్తములకు యో
గీశ్వరులకును యతీశ్వరులకు
భక్తివైరాగ్యసంపద్విశిష్టులకు నే
కాంతవాసులకు వేదాంతులకును
చండాలపుల్కస శ్వపచకంకకిరాత
శబరహూణాంగనాసంగతులకు
బ్రహ్మహత్యాసురాపానహేమస్తేయ
గురువధూసంగమకరవరులకు

తే॥ సుందరీక్షత్రియోరవ్య శూద్రులకును
మరియు నానావిధానేకమానవులకు
పరమపావనమై శుభప్రదమ్మునైన
రామనామంబు శరణంబు రాజవదన.

తా॥ పార్వతీ! ద్విజులలో శ్రేష్ఠునకును వేదపారకు లును యోగీశ్వరులును యతీశ్వరులును భక్తివైరాగ్యములు గలవారలును చండాల, పుల్కస, శ్వపచ, కంక, కిరాత, శబర, హూణు లనబడు సర్వహీనజాతులవారున్ను, బ్రహ్మ హత్యాది సర్వపాపము లాచరించినవారైనను యీ శ్రీరామ షడక్షరీ మంత్రమును పఠించి తరించవలయును. ఇదియే సర్వజనులకు సంసారసముద్రమును దాటించుటకు మార్గాధార నావయగునని యీశ్వరుడు పార్వతి కుపదే శించెను.

కనుక సర్వసుజనులైన నా ఆత్మహితులారా! ప్రణా వములేని మంత్రమే నపుంసకమని చెప్పియుండగా (శ్రీ) యను ప్రకృతిబీజముగూడా లేని మంత్రముగతి యింకా ఏమని చెప్పవలయును. ప్రతివాక్యమునకు సహితము కర్త కర్మక్రియలతో అన్వయించునట్లు పదముచ్చరించినగాని దాని స్వరూపము నెరుంగలేము. అట్టి విషయములో యీ లోకము నందు స్వానుభూతిలేని వ్యష్టిమానవు లెందరో ద్విజేతరజాతు లైన స్త్రీ పురుషులు (రామ రామ) అని యుచ్చరించవలసి

నదేగాని (శ్రీ)రామ) అని ఉచ్చరించగూడదని పలుకు చుండురు. కనుక అట్టి స్వాభిమానులవాక్యములు విని మీరు వ్యర్థమానసులై (శ్రీ)యను శబ్దము ఉచ్చరించిన మన కేమి హాని గలుగునోయను భయంబుచే రామరామ యని మాత్రమే ఉచ్చరించితిరేని మీకు హానియే కలుగును. ఎందువల్లననగా సంపత్కారనైన (శ్రీ) బీజమును ఎప్పుడు వదలితిరో అప్పుడే మీరు యిహపరసౌఖ్యంబులు గోలుపోవుదురు. అది యటు లుండ రామ యను శబ్దమును, నారాయణా అను శబ్దమును, సోహాంఅను శబ్దమును సన్యసించినట్టి సర్వసంగపరిత్యాగులకు యతు లుచ్చరించవలసినదేగాని గృహస్థు లుచ్చరించినసంపద హీనంబగును. దీనికి దృష్టాంతము చిన్న యితిహాసమువినుడు.

రామదాసుగారు (శ్రీ)రాముని పన్నెండు సంవత్సర ము:లు ప్రార్థించినను ఏమి ప్రయోజనము లేకపోయెను. అప్పుడు సీతనుగురించి ఒక కీర్తన స్తోత్రము చేసినంతమాత్ర ముననే రామదాసుగారి కష్టములు గట్టెక్కెను. ఈ విషయ ము నందరు ఎరిగియున్న కథయేకదా. కనుక ప్రతియొక మం త్రమునకు ఆదియందు ప్రకృతిబీజంబైన (శ్రీ)కారమైన నుండ వలయును. లేక పురుషపరబీజంబైన ఓంకారమైన నుండవల యును. ఈరెండు బీజములులేని మంత్రమును పఠించువారు ఏఫలము బొందజాలరని శ్రుతిస్మృతిసిద్ధముగనుక సుజను లైన సర్వమానవులారా! (శ్రీ)రామ మంత్రమును శ్రీయుక్త

ముగ సద్గురువుద్వారా తెలిసికొని సదా పఠించి యిహపర సౌఖ్యంబు లనుభవించుడు.

{ శివపంచాక్షరీ మంత్రానుష్ఠాన సర్వజనసమష్టి వినుడు. }

శ్లో॥ మహాపాతకదావాగ్ని, సోఽయం మంత్ర షడక్షరః
ప్రణవేనవినా మంత్ర, సోఽయం పంచాక్షరో మతః
స్త్రీభి శ్శూద్రై శ్చ సంకీర్ణై, ర్ధార్య తేము క్తికాంక్షిభిః
నాస్యదీక్షా నహోమశ్చ, నసంస్కారో నతర్పణం
నకాలనియమ శ్చాత్ర, జప్యస్సర్వై రయం మనుః.
—బ్రహ్మోత్తరఖండము.

తా॥ అనగా (శివమంత్రము) ఓంకారము గలిసియుండిన ఆరక్షరములు గలదియగును. అది లేనిచో పంచాక్షరములు గలదియగును. ఇట్టి రెండు విధములయిన మంత్రమును పఠించువారికి దావాగ్నివలె సర్వపాపములు దహించును. ఈ మంత్రమును మోక్షాపేక్షగల ప్రతి యొకరును అనగా శూద్రులు స్త్రీలు సంకరజాతులవారైనను పఠింపవచ్చును. దీనిని పఠించుటకు దీక్షగాని హోమముగాని సంస్కారము గాని తర్పణముగాని కాలనియమముగాని, అక్కర లేదు. అయితే యిచ్చట ప్రణవములేని మంత్రమునే సర్వులు పఠింపవచ్చునని కొందరు చెప్పవచ్చునుగాని ఆత్మలాభాపేక్షగల సర్వసుజనులారా! యీ శివమంత్రమును, మీకు ప్రథ

సమున ఉపాధ్యాయులే ఓంనమశివాయ అని దిద్దించి
యున్నారు. దానినే యిప్పుడు జ్ఞానోపదేశాచార్యులు యీ
వమంత్రమునకు దీక్షయు మంత్ర మంత్రార్థరహస్యములు
తెలియజేయుచున్నారు. కనుక క్రొత్తగా యీ మంత్రమును
పఠించవచ్చును, పఠించకూడదు అను వ్యష్టివాదసందే
హము మీాకక్కరలేదు. అందుకు యీాపైని నిరూపించిన
యీాశ్వరవాక్యంబగు సాక్ష్యమే మిమ్ములను సర్వవిధముల
బోధించును. కనుక యీా శివపంచాక్షరీమంత్రమును సర్వ
జను లుపాసనీయులై యీా మంత్రరహస్యమును మాత్ర
ము సద్గురువువలన సక్రమముగా తెలిసికొని ఆత్మరహస్యాను
భవసానుభూతులరై, సత్యవర్తనానుభవులై యిహపర
సౌఖ్యంబు లనుభవించుడు. (ఈ మంత్రమునకు ప్రణవము
లేనియెడల నపుంసకమగుననియే ఆదియందు ఓంకారమును
ఋషులెల్లరును చేర్చి పఠియించియున్నారు. అట్లయిన ఆరు
అక్షరములు కలదియైనది. అట్లయినప్పటికిని శివపంచాక్షరి
యని చెప్పుకొనుటయే వాడుకగలదు. కనుక ఆరక్షరములు
గల మంత్రమునే సర్వజనులు పఠించి కృతార్థులగుదురుగాక.

{ ప్రణవపఠనాధికారమునుగురించి
సర్వజనసమష్టి వినుడు. }

శ్రుతి:-హరి ఓమ్॥ అథహైనం శైవస్సత్యకామః ప్రపచ్ఛ
సయోహావై తద్భగవన్ మనుష్యేషు ప్రాయణాన్త

మోఙ్కార మభిధ్యాయీత కతమంవా వస తేన లోకం జయతీతి. —ప్రశ్నోపనిషత్ 5 అ.

తా॥ (అనగా శిబికుమారుడగు సత్యకాముడను మహా ఋషి, పిప్పలాదుని గురించి ఇట్లు ప్రశ్నజేసెను.) ఓపిప్ప లాదుడా! మనుష్యులలోపల యెవడు పరాపరప్రాప్తిసాధన మగు ప్రసిద్ధమయిన 'ఓమ్‌కారమును' ధ్యానించుచున్నాడో అట్టివాడు జ్ఞానకర్మల చేత పొందదగినవగు అనేక లోకము లలో ఏలోకమును పొందుచున్నాడు అని ప్రశ్న చేయగా పిప్పలాదు డిట్లనియె.

శ్రుతి:-తస్మై స హోవాచ ఏతద్వై సత్యకామ పరంచాపరం చ బ్రహ్మయదోఙ్కార స్తస్మా ద్విద్వా నేతే నైవాయ తనేనైకతరమన్వేతి. —ప్రశ్నోపనిషత్ 5 అ.

తా॥ ఓసత్యకాముడా! ఏకారణమునుండి పరాపర రూపమైన పరమాత్మప్రాణరూపమగు ఈ పరబ్రహ్మము ఓంకారమే అగుచున్నదో ఆకారణమువలననే, ఇట్లు ఓంకార మును పరబ్రహ్మముగా తెలిసికొనిన జ్ఞానవంతుడు అధిక మగు ఓంకారధ్యానముచేతనే వాని ఉపాసనానుసారముగా అనగా ఈసర్వలోక సర్వవిషయ ఫలములలో తాను యేయి చ్ఛను బొంది ప్రణవమును ఉపాసించుచుండునో తత్ఫలమునే ఉపాసకుడు బొందును. అని పిప్పలాదుడు ప్రత్యుత్తరము జెప్పెను.

అనగా యిచట యిరువురి సంవాదమునందు సర్వజన సమష్టితో ప్రణవోపాసననుగురించి సత్యకాముడు ప్రశ్న జేసెను. అప్డు పిప్పలాదుడు సర్వజనసమష్టితో ప్రత్యుత్తర మిచ్చెను. (ఇట్టి కొన్నిసాక్ష్యములను వినుడు)

శ్రు.-శుచిర్వా ప్యశుచిర్వాపి యోజపేత్ ప్రణవం సదా
స నలిప్యతి పాపేభ్యో పద్మపత్రమివాంభసా.
—యోగచూడామణ్యుపనిషత్.

తా॥ అనగా శుచిగానుండిగాని అశుచిగానుండిగాని సదా ఏమానవుడు ప్రణవమును (అనగా ఓంకారమును) జపించుచుండునో వాడు తామరాకునందు బడిన నీటిబొట్టు వలె సర్వపాపములను నంటక బంధవిముక్తుడగును.

శ్లో॥ ఓమిత్యేకాక్షరంబ్రహ్మ వ్యాహర న్మామనుస్మరన్
యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాంగతిమ్.
—భగవద్గీత.

తా॥ ఏమనుష్యుడు (ఓమ్) అనెడు ఏకాక్షరమును బ్రహ్మముగా నుచ్చరించుచు, నన్ను స్మరించుచు దేహమును వదలునో వాడు అర్చిరాదిమార్గమున ఉత్తమగతిని బొందు నని శ్రీకృష్ణుడు నుడివెను.

శ్రు:-ప్రణవోహి పరంబ్రహ్మ ప్రణవః పరమంపదం
ప్రణవః సర్వవేదాద్యం సర్వవేదమయం విదుః
సర్వేషాంచైవమంత్రాణాం ప్రణవఃప్రాణఉచ్యతే.

తా॥ ప్రణవమే పరబ్రహ్మము. ప్రణవమే పరమపదము. ప్రణవము సమస్తవేదములకు మూలకారణము గనుక సమస్తమంత్రములకు ప్రణవమే మూలాధారప్రాణమైయున్నది. అందువలన ప్రణవములేని మంత్రమును జపించుట శవమునకు తాళిబొట్టు గట్టినట్లే నని యెరుగునది. కనుకనే శ్రుతి యిట్లు బలుకుచున్నది.

శ్రు:-ప్రణవా దపరం జప్త్వా కదా ముక్తో భవిష్యతి
ఓంకార స్సర్వమంత్రాణా ముత్తమం పరికీర్తితః
—సూతసంహిత.

తా॥ ఓంకారమున కన్యములగు ఇతరములైన మంత్రము లెన్ని జపించినను వా డెప్పుడు ముక్తినొందును. అనగా సర్వమంత్రములకు ప్రణవమే ప్రాణమైయుండగా ప్రణవము వినా యిక యెన్నిమంత్రములు జపించినను వాడు ముక్తినొందడనుట. ఎందువల్లననగా-

శ్రు॥ ఓంకారప్రభవా వేదా, ఓంకారప్రభవ స్స్వరాః
ఓంకారప్రభవం సర్వం, త్రైలోక్యం సచరాచరం.
—ధ్యానబిందూపనిషత్.

తా॥ ఓంకారమునుండియే వేదముగలిగినది. ఓంకారమునుండియే స్వరముగలిగినది. ఓంకారమునుండియే సర్వలోకములయొక్క చరాచరము లాదిగాగల సర్వము గలిగినది. కనుక విజ్ఞానవంతులగు ఓ సుజనులారా! పిపీలికాది బ్రహ్మ

పర్యంతము గల సర్వభూతములును, దారమునకు మణులవలె ఓంకారమునందుననే కూర్చబడియున్నవి. కనుక యిందు ప్రణవమును జపించదగినవా డొకడుకలడను వారి ఆభాసభావనచెవియొగ్గి వినక సర్వమునకు ఓంకారస్వరూపుడైన సర్వేశ్వరుడే రక్షకుడను నమ్మి, సర్వవిధకార్యములకును మోక్షమునకును సదా ప్రణవబ్రహ్మమును ధ్యానించి, సర్వజనులు యిహపరసౌఖ్యంబు లనుభవింతురుగాక.

{ యజ్ఞోపవీత ధారణరహస్యతత్త్వవిధి
సర్వజనసమష్టి విధుడు. }

శ్లో॥ హృదిహ్యేతా దేవతా స్సర్వాః, హృదిప్రాణాః ప్రతిష్ఠితాః
హృదిప్రాణశ్చ జ్యోతిశ్చ, త్రివృత్సూత్రంచ తద్విదు
రితి హృది చైతన్యే తిష్ఠతి.

—బ్రహ్మోపనిషత్ 7.

తా॥ సమస్తములగు యింద్రియములును, ఆయా అధిష్ఠానదేవతలున్ను, సర్వమున్ను, పంచప్రాణములున్ను, (సర్వభూతహృదయముననే) ప్రతిష్ఠింపబడి యున్నవి. ఈపంచ ప్రాణములను తేజోరూపమగు నాత్మను, నింద్రియ ప్రాణతేజస్సులను, మూటిస్వరూపమగు సూత్రాత్మయను (యజ్ఞోపవీతము) అపరబ్రహ్మస్వరూపమేయని బ్రహ్మవేత్తలు దెలిసికొను చున్నారు. కనుక ఆపరబ్రహ్మరూపమగు నింద్రియప్రాణతేజోరూపమైన సూత్రాత్మను యజ్ఞోప

పీతము జ్ఞానాత్మకమైన బుద్ధి గుహాయందున్నది. గాన యిట్లు,

శ్రు॥ యజ్ఞోపవీతం పరమంపవిత్రం ప్రజాపతేర్య త్సహజం
పురస్తాత్, ఆయుష్యమగ్రియం ప్రతిముంచ శుభ్రమ్
యజ్ఞోపవీతం బలమస్తు తేజః. —బ్రహ్మోపనిషత్.

తా॥ ముందుగా సృష్టికర్తయగు బ్రహ్మకు దోడబుట్టినదియు, శ్రేష్ఠమును పావనమును నాయుర్దాయమును గలుగ జేయునదియు నగు సూత్రరూపమగు యజ్ఞోపవీత మేదిగలదో దానిని గ్రహింపుము. పరిశుద్ధమును దృఢమును తేజోరూపమునగు యజ్ఞోపవీతము (బుద్ధి గుహాయందు నింద్రియప్రాణ తేజోరూపము లను మూడు విధములుగ నుండు పరబ్రహ్మ స్వరూపమైన సూత్రాత్మయనుయజ్ఞోపవీతము) గలుగునుగాక! అని మంత్రము,

శ్రు:-సూత్రమంత్రగతం యేషాం జ్ఞానయజ్ఞోపవీతినాం
తేవై సూత్రవిదో లోకే తేచ యజ్ఞోపవీతినః.
—బ్రహ్మోపనిషత్ 13.

తా॥ పరబ్రహ్మజ్ఞానమే యజ్ఞోపవీతముగా యెవరికి యజ్ఞోపవీతము గదో వారే లోకమునందు యజ్ఞోపవీతము నెరింగినవారు. వారే యజ్ఞోపవీతము గలవారు.

శ్రు:-జ్ఞాననినో జ్ఞాననిష్ఠః జ్ఞానయజ్ఞోపవీతినః
జ్ఞానేవ పరం తేషాం పవిత్రం జ్ఞాన ముచ్యతే.
—బ్రహ్మోపనిషత్ 14.

తా॥ అనగా బ్రహ్మజ్ఞానమను యజ్ఞోపవీతముగలిగి బ్రహ్మనిష్టను పొందుట యేదికలదో అదియే శ్రేష్ఠమై పవిత్రమైన యజ్ఞోపవీతముగా వారికి చెప్పబడుచున్నది.

శ్రు:-అగ్నిరివ శిఖానాన్యాయస్య జ్ఞానమయీా శిఖా
నశిఖీత్యుచ్యతే విద్వాన్నేతరే కేశధారణః. 15

తా॥ ఎవనికి జ్ఞానాగ్నియను శిఖ కలదో వారికి శిరస్సునజుట్టుశిఖయక్కరలేదు. వారికి వారిజ్ఞానమే శిఖయని చెప్పబడుచున్నది. అట్లు జ్ఞానశిఖ లేక బాహ్యశిఖ ధరించినవారలు శిఖాయజ్ఞోపవీతములు ధరించినవారు కారు. (మరి యెవ్వరనిన)

శ్రు:-శిఖా జ్ఞానమయీా యస్య ఉపవీతంచ తన్మయం
బ్రాహ్మణ్యాగ్ సకలంతస్య ఇతిబ్రహ్మవిదో విదుః. 17

తా॥ ఎవనికి బ్రహ్మజ్ఞానమును శిఖాయజ్ఞోపవీతములును కలవో వానికి సమస్తమగు బ్రాహ్మణ్యమును కలదని బ్రహ్మవేత్తలు తెలిసికొనుచున్నారు.

శ్రు:-ఇదంయజ్ఞోపవీతంతు పరమం యత్పరాయణం
సవిద్వాన్యజ్ఞోపవీ స్యాత్యయజ్ఞస్తం యజ్వానంవిదుః
—బ్రహ్మోపనిషత్. 18

తా॥ ఈబ్రహ్మజ్ఞానతత్పరత్వమను యజ్ఞోపవీతము నెవ్వడు ధరియించియుండెనో అట్టివాడుయజ్ఞోపవీతి యగును.

అట్టిబ్రహ్మను తెలిసినవాడే యజ్ఞస్వరూపుడు. వానినే బ్రహ్మ వేత్తలు యజ్ఞములు జేసినవానినిగా దెలిసికొనుచున్నారు.

కనుక సర్వసోదరీసోదరులారా! యీలోకములో సంకర జాతు లాదిగాగల ద్విజులవరకును అనేకజాతీయసంఘముల వారు శిఖాయజ్ఞోపవీతములు బాహ్యరూపములుగా నూలుతో జంధ్యమును శిరస్సున జుట్టును నామకార్థముగ ధరించుచు న్నారుగాని దానివలన బ్రాహ్మణత్వము కలదని సంతసించు వారు వ్యర్థులగుదురు. ఇట్టిబాహ్యరూపమయిన శిఖాయజ్ఞో పవీతము నాకు లేదని చింతించువారు వ్యర్థులగుదురు. ఎందు కనిన ఉపనయనసంస్కారములు బొందినంతమాత్రముననే సద్గుణసదాచారసంపద్విశిష్టము లేని ద్విజులకు వేదము గరుప గూడదనియు అతిథిపూజ సలుపగూడదనియు మీకు చతుర్థా శ్వాసమున స్మృతిప్రమాణములు చూపియేయున్నాను. ఇట్టి యిన యీలోకంబున వాడుచున్న ద్విజులయందు బ్రాహ్మణ శబ్దము అగ్రాసనాధిపత్యము లేదాయను ప్రశ్నయే కూడదు. ఎందువల్ల ననగా ఒకమనిషికి పుట్టినపుడె శాస్త్రులుగారని పేరు పెట్టియుందురు. మరియొకరికి విద్వాంసుడైనతరువాత నర్థానా నుభవమునుబట్టి శాస్త్రులుగా రని లోకులచే గౌరవార్థముగ వారిని పూజించి గౌరవించుట గలుగును. అప్పుడు పూర్వము జన్మదారభ్యశాస్త్రులుగా రను నామకరణము బొందిన ఆయన వచ్చి నాపేరుశాస్త్రులు గారేకదా! న న్నెందులకు పూజించి

గౌరవించి రని పోట్లాడుట ఎట్లుండునో, అట్లే వంశపరంపరా లోకనటనార్థము ఒక సంఘమువారియందు బ్రాహ్మణ నామ కరణము పొందబడియుండెను. అట్టివారి కులములో బుట్టినంత మాత్రముననే సంస్కారమును బొందినంత మాత్రముననే పైన జెప్పిన "బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః" అను బ్రహ్మజ్ఞానయజ్ఞోప వీతములు లేనివారు ఏజాతివారైనను పూజార్హులునుగారు. శ్రు తిపఠనార్హులును గారు. కనుకనే బాహ్యయజ్ఞోపవీతములు లేకపోయినను అనేకమంది స్త్రీపురుషులు బ్రహ్మతత్పరులై యజ్ఞపఠనార్హులై శాశ్వతఋషులై చుక్కలలో చంద్రునివలె సదా సర్వశాస్త్రములచే బొగడొందు చున్నారు. వారి నామ ములను వినుడు.

బ్రహ్మజ్ఞాన తత్పరుల జాతీయసమష్టి వినుడు.

స్త్రీలు వేదఋక్కుల ననుష్ఠించి ఋషిక లగుట.

(1) ఋగ్వేద చతుర్థాష్టక ప్రథమాధ్యాయమునందు షడృక్కులుగల సూక్తమును అత్రిపుత్రికయగు విశ్వావర యను స్త్రీ తనతపోబలముచే గనిపెట్టినందున వాటి కామెఋషి క యయ్యెను.

(2) ఆత్రేయియగు అపాలయగు స్త్రీ తనకు విశేష రోగ ముండుటచే భర్త తనను విడువగా అందుల కామె యిం ద్రదేవతను గూర్చి ఋగ్వేదములోని 8-191- 3-4 ఋక్కు లతో ప్రార్థించగా ఆయింద్రదేవతానుగ్రహము వలన

తన భర్త తనను మరల స్వీకరించెను. అందు ఆఋక్కుల నామె మొదట కనిపెట్టినందున వాటి కామెఋషిక యయ్యెను.

(3) రాజఋషియగు కక్షీనుడు 1-117-7 ఋక్కులను గనిపెట్టెను. అతనికూతురు ఘోషయను నామె చాల కాలము పెండ్లిలేకయే తండ్రియింటనుండి అశ్వనీ దేవతలను గురించి 10-40-14-1-122-5 ఋక్కులతో ప్రార్థించగా వారు ఆమెకు నర్జునుడను భర్తను నొసంగిరి.

(4) సికితనివావిరిస్త్రీకవులు 9-86-11-20 ఋక్కులతో సోమదేవతను ప్రార్థించినట్లున్నది.

(5) గోధ అగస్త్య సోదరి 105 వ మండలములో 10-184 ఋక్కులతో యింద్రదేవతను ప్రార్థించి నట్లున్నది.

(6) ఇంద్రుని భార్యయగు శచీదేవిగూడా కొన్ని ఋక్కులకు ఋషికయైనట్లు ఆమండలములోనే కలదు.

(7) లోపాముద్రయను స్త్రీ తపస్సులో మునిగిన తన భర్తయగు అగస్త్యఋషి తనను ప్రేమించుకొరకు 1-179-1-2 ఋక్కులతో ప్రార్థించగా ఆదేవత కరుణచేత తనభర్త ప్రత్యుత్తర మిచ్చినట్లున్నది.

ఇట్లు స్త్రీ చరిత్రలు యింకా ఋగ్వేదమునందు గలవు. ఇది యిట్లుండ సరస్వతీ లక్ష్మీ పార్వతులు సర్వ వేదాధికారులుగా నున్నారు. కనుక స్త్రీల విషయము ఇట్లున్నది. ఇక పురుషుల విషయము.

శ్లో॥ ఋష్యశృంగో మృగేజాతః కౌశికో గాధినందనః
జంబుకో జంబుకోత్పత్తిః, గౌతమో గౌతసంభవః
వాల్మీకో వల్మికోత్పత్తిః, అగస్త్యః కుంభసంభవః
వ్యాసో లుబ్ధకసంభూతో, వసిష్ఠో ఊర్వశీసుతః
నారదో రజకీపుత్రో, కౌండిన్యో ముండకీసుతః
మతంగస్య మతంగస్స్యాత్, మాండవ్యో మండకీసుతః
సాంఖ్యాస సర్పసంభూతో, గార్గేయో గార్ధభస్సుతః
శునకీగర్భంసంభూతో, శౌనకాదిమహర్షయః.

—మనుస్మృతి.

తా॥ ఋష్యశృంగుడు లేడియందును, కౌశికుడు క్షత్రియకులమందును, జంబూకుడు నక్కయందును, గౌతముడు గోవునందును, వాల్మీకుడు పుట్టయందును, అగస్త్యుడు కుండయందును, వ్యాసుడు బోయస్త్రీయందును, వసిష్ఠుడు బోగముస్త్రీయందును, నారదుడు చాకలస్త్రీయందును, కౌండిన్యుడు ముండమోపియందును, మతంగుడు మాదిగస్త్రీయందును, మాండవ్యుడు కప్పయందును, సాంఖ్యుడు సర్పమునందును, గార్గేయుడు ఖరమునందును, శౌనకాదిమహర్షులు శునకమునందును జన్మించి వీరు సర్వవేదవేదాంగవేదాంతములకు అధిపతులై మహర్షులైరి. వీర లేరూపముతో సర్వకర్మాధికారులైనారో తెలిసికొనుడు. కనుక బ్రహ్మజ్ఞానానుష్ఠానపరుడు ఏజాతివాడైనను, సర్వకర్మానుష్ఠానాధికారము

వానికి స్వాధీనమై యుండునని సర్వులు నెరుంగునది. (ఇంకా నిట్లే భాగవత నవమస్కంధమునందు ద్విజేతరులు బ్రహ్మానుభవులై బ్రాహ్మణులై యున్న కథలను చదివి తెలిసికొనుడు. ఇట్లే యింక బ్రహ్మతత్పరులైనవారి విషయములను వినుడు.

శ్లో॥ జైగీషవ్యో యథావిప్రో యథావైకాశితాదయః
క్షత్రియాజనకాద్యాస్తు తులాదారదయో విశః
ధర్మవ్యాధాదయస్స్వత్త శూద్రాశ్చైలవకాదయః
మైత్రేయీ సులభాశార్ఙ్గీశాండిలీచ తపస్వినీ
ఏతేచాన్యేచబహవో నీచయోనిగతా అపి
జ్ఞాననిష్ఠాంపరాం ప్రాప్తాః ... ...

—భారతము.

తా॥ జైగీషవ్యుడను బ్రాహ్మణుడు, అట్లే యసితాదులును, జనకాదులగు క్షత్రియులును, తులాధారాదులగు వైశ్యులును, ధర్మవ్యాధుడు మొదలగు ఏకురు శూద్రులును స్త్రీలలో మైత్రేయి, సులభ, శార్ఙ్గీ, శాండిలి, తపస్విని మొదలగు ఆడువారును ఇట్లే అంత్యజాతులయిన అనేకులుకూడ బ్రహ్మజ్ఞానతత్పరులై జ్ఞాననిష్ఠానుభవముచే శాశ్వతసౌఖ్యమును బొందియుండిరి. (గనుక)

శ్రు:—యతస్తతః శిఖాయజ్ఞోపవీత వేదాధ్యయనాది పరిత్యజ్యాపి నశూద్రాదిసమానత్వేన శంకనీయః

కింతుః సా యేవనిత్యపూతస్థోనత్యన్యో వేదాధ్యయనాదిమానపి.
—పరమహంసోపనిషత్.

తా॥ నిత్యం=సర్వదా. కాలత్రయేఽపి. అశేషవిశేషశూన్యత్వేన పూతం=పవిత్రం శిఖా యజ్ఞోపవీతి వేదాధ్యయనాదిత్యాగశుద్ధి కారణం । సత్యజ్ఞానమనంత ఆనందాత్మస్వరూపంయద్బ్రహ్మత స్మిన్నిదహమస్మీతిఐక్యేనవతిష్టతి.-రామానందస్వామివ్యాఖ్య.

తా॥ అట్టివానికి అనగా శిఖాయజ్ఞోపవీత వేదాధ్యయనాదికములు, లేకపోయినను బ్రాహ్మణుడు కాకపోడు. అట్టి బ్రహ్మైకాత్మైక స్థితికలవాడే, సద్బ్రాహ్మణుడుగాని తదితరుడగు కేవల శిఖాయజ్ఞోపవీత వేదాధ్యయనములు గలవాడు కాడు. బ్రహ్మతత్పరు డెవడో అతడే వేదపురుషుడు, అనగా నాలుగు వేదములు నెరింగినవాడు. కనుక యితడు నిత్యపూతస్థుడనబడును. అనగా పరిపూర్ణబ్రహ్మస్వరూపుడని అర్థము. కనుక నిట్టివానియందు శూద్రుడను భావ ముండజనదు అని శ్రుతివచనము కనుక సర్వసుజనులారా! లోకవిడంబమైన సాంఘిక వ్యష్టివాదములచేత ఆత్మావలోకమును మరచి వృధా కాలముగడుపక సత్యసమష్టిరహస్యతత్త్వము నెరింగి లోకులతో వివాదమువదలి ప్రతియొకరు సర్వభూతదయతో స్వాత్మారాధనతో వర్తించుటయే సర్వజనులకు నిజమైన బ్రాహ్మణత్వము సిద్ధించును. ఇందులకు ప్రమాణము.

స్మృ:—యథోక్తాన్యపికర్మాణి పరిహాయ ద్విజోత్తమః
ఆత్మజ్ఞానే న శమేచ స్యాద్వేదాభ్యాసేచ యత్నవాౝ.
—మనుస్మృతి.

తా॥ ఉత్తమ మైన బ్రాహ్మణత్వము సిద్ధించుటకు వేదాధ్యయనమేది యనగా, కర్మభ్రాంతిని వదలి, బ్రహ్మనిష్ఠను బొందియుండుటేయని యెరుంగవలయును. ఇట్టివాడే జాతివాడైనను నిజమైన బ్రాహ్మణుడుగా నెరుంగుడు.

శ్లో॥ నజాతికారణం తాత, గుణాః కల్యాణకారణం
వృత్తస్థ మపి చండాలం, తం దేవాబ్రాహ్మణం విదుః.

తా॥ బ్రాహ్మణత్వమునకు జాతికారణము గాదు. కల్యాణగుణములు గలవృత్తి చండాలునియం దున్నయెడల వాడు బ్రాహ్మణుడని దేవతులు వానిని వీక్షించెదరు. అని ధర్మజుని వాక్యము.

**అయితే యిట్లు** గుణవర్తనయే ప్రధానకారణముగా, బ్రాహ్మణత్వము యీగ్రంథమందు సాంగముగా సాక్ష్యములు నిచ్చియున్నావు గాని శూద్రున కెంతబ్రహ్మజ్ఞానము గలిగినప్పటికిని ద్విజులతో కలిసి భుజించవచ్చునా అను ప్రశ్నకు సమాధానసాక్ష్యములను వినుడు.

{ సజ్జనసమూహ సద్గోష్టి
సమష్టి భోజన ప్రమాణములు }

శ్లో॥ శూద్రేషుదాసగోపాల కులమిత్రార్ధసీరిణః
భోజ్యాన్నా నాపితశ్చైవయశ్చాత్మానంనివేదయేత్
—యాజ్ఞవల్క్యవచనము.

(ఈ అర్థమునే యన్వయించు దేవలవచనము)

శ్లో॥ "స్వదాసో నాపితో గోపః కుంభకారః కృషీవలః
బ్రాహ్మణైరపి భోజ్యానాః పంచైతే శూద్రయోనయః"

తా॥ గురుశిశ్రూషాపరాయణుఁడును, నాపితుఁడును, గొల్లవాఁడును, కుమ్మరివాఁడును, సేద్యముసేయువాఁడును, యీ ఐదుగురు వండినఅన్నమును బ్రాహ్మణాదులుగూడా భుజింపవచ్చును.

శ్లో॥ "త్రిషువర్ణేషు కర్తవ్యం పక్వభోజనమేవచ
శుశ్రూషామపిపన్నానాం శూద్రాణాంచ వరాననే."
—వరాహపురాణవచనము.

తా॥ ద్విజులు విప్రక్షత్రియవైశ్యగృహములందును పక్వాన్నము భుజింపవచ్చును. అట్లే గురుసేవాపరాయణుడైన శూద్రునియింట పక్వాన్నమును గూడా భుజింపవచ్చును.

శ్లో॥ "రాజ్ఞాంపర్వణివైశ్యానా మశ్నీయా న్మంగళే గవాం
వాసోరత్నభూమాన్నం సచ్ఛూద్రస్యగృహే తథా."
—శూలపాణిగ్రంథమందు బ్రహ్మావచనము.

తా॥ ద్విజులును, రాజులును, వైశ్యులునుసచ్ఛూద్రుల యొక్కయు యిండ్లయందు పర్వడిదివసములందు గోవులు వస్త్రములు భూమి రత్నములు సువర్ణము పక్వాన్నమును గ్రహింపవచ్చును.

శ్లో॥ "కందుపక్వం స్నేహపక్వం పాయసం దధిసక్తవః
ఏతాని శూద్రాన్నభుజో భోజ్యాని మనురబ్రవీత్."

తా॥ శూద్రునిచే మంగలములో వేపిన పేలాలును, నూనెతో వండిన పిండివంటలును పెరుగు సత్తుపిండి పరమాన్నము ద్విజులు భుజింపవచ్చును.

కనుక సర్వసుజనులారా! యీ గ్రంథమునందు చూపెట్టినవన్నియును ఋషులయొక్క యథార్థాభిప్రాయములు గ్రంథగర్భములయందు నుంచబడియే యున్నవి. ఇట్టి ధాన్యమునుండి తీసిన బియ్యమువలె యథార్థాభిప్రాయసమష్టితత్త్వమును స్వానుభూతితో గ్రహించక వ్యష్టిదృష్టితో తామసవాదములకు లోబడి మీ ఆత్మరతి మీరు కోలుపోవనేల? సమష్టిదృష్టితో సర్వభూతదయ గలిగి, సర్వజనులు మోక్షసాంప్రదాయకులు గావలయుననే అభిలాషతో మీకు మీకు లభించియున్నటువంటి కర్మజ్ఞానకాండలను బ్రహ్మవిద్యను సజ్జనులైన సర్వజనులకు బోధించి ఋషిఋణవిముక్తి జేసికొని సర్వేశ్వరుని కృపాకటాక్షములకు పాత్రులరై యిహపరసౌఖ్యంబు లనుభవించుడు.

సద్గురుపీఠాధికారసర్వజనసమష్టి వినుడు.

స్మృ:—శ్రద్దధాన శ్శుభాం విద్యా మాదదీతాఽవరా దపి
అంత్యాదపి పరంధర్మం స్త్రీరత్నం దుష్కులాదపి.

—మనుస్మృతి. అ2. శ్లో238.

తా॥ విద్యసంపాదించుటయందు శ్రద్ధగలవాడు శ్రేష్ఠమైన విద్యను తక్కువజాతివానియొద్దనైనను గ్రహింపవచ్చును. మోక్షధర్మము చండాలునివద్దనైనను గ్రహింపవచ్చును. గుణవతియగు స్త్రీని తక్కువకులమునుండియైనను వివాహ మాడవచ్చును.

శ్లో॥ స్వాశ్రమంచ స్వజాతించ స్వకీర్తిం పుష్టివర్ధనం
ఏతత్సర్వం పరిత్యజ్య గురోరన్యం నభావయేత్.

—గురుగీత.

తా॥ తనయాశ్రమమునకంటె తక్కువయాశ్రమమునందున్నవాడైనను తనజాతికంటె తక్కువజాతివాడైనను తనకంటె కీర్తి బలము ధనము తక్కువవాడైనను సద్గురువునందు (సద్గుణసమష్టి శాస్త్రసమ్మతమైన దైవభక్తి గురుభక్తి గలిగియున్నవాడైనయెడల) అట్టిపుణ్యాత్ముని అన్యవిషయలోపములను గురించి భేదమెంచక ఆతని నాశ్రయించి బ్రహ్మవిద్యాదిగాగల సర్వవిద్యలను అభ్యసించవలయును.

(1) ఇట్టి సాక్ష్యముల ననుసరించియే అవధూతాశ్రమవాసుడై బ్రహ్మతత్పరుడైన శ్రీశుకుండు క్షత్రియుడై గృహస్థుడైన జనకమహారాజు నాశ్రయించి సందేహములను దీర్చుకొనెను.

(2) భారతారణ్యపర్వమునందు వేదాధ్యయన తపోధననిష్ఠాగరిష్ఠుడగు కౌశికుడను బ్రాహ్మణుడు కటికివాడైన ధర్మవ్యాధుని నాశ్రయించి, అనేకధర్మములను దెలిసికొనెను.

(3) క్షత్రియుడైన ధృతరాష్ట్రుడు సంకరుడైన సంజయునియొద్ద భగవద్గీతోపదేశము బొందెను.

(4) బ్రహ్మణ్యులైన శౌనకాదులు సూతునివలన సర్వధర్మములను దెలిసికొనిరి.

(5) బ్రాహ్మణుడై భక్తాగ్రేసరుడైన రామదాసు తురుష్కుడైన కబీరునొద్ద తారకోపదేశము నొందెను. ఇత్యాది ప్రమాణము లనేకములు గలవు. శాస్త్రజ్ఞుల కనుభవనీయమే యనియు అట్టి సర్వసమష్టిబోధనానుకూలము సర్వులకు సమష్టితో బోధించగలందులకును సర్వులకు దెలియగలందులకును ఈశ్వరుడు చండాలవేషధారియై శంకరునకు బోధించిన మనీషాపంచకమును వినుడు.

—— మనీషా పంచకము ——

శ్రీమచ్ఛంకర భగవత్పాదవిరచితము.

శ్లో॥ సత్యాచార్యస్య గమనే కదాచి న్ముక్తిదాయకమ్
కాశీక్షేత్రం ప్రతిసహ గౌర్యామార్గేతు శంకరమ్
అంత్యవేషధరం దృష్ట్వా గచ్ఛగచ్ఛేతి చాబ్రవీత్
శంకర స్సోపి చండాలః తం పునఃప్రాహ శంకరమ్.

తా॥ శ్రీమచ్ఛంకరాచార్యవర్యుడు కాశీక్షేత్రమునకు బోయి అచట నివసించియున్నపుడు (ఒకనాడు కాశీనదిలో స్నానముచేసి వచ్చుచున్నవేళ) మార్గమధ్యమందు ఈశ్వరుడు పార్వతీసమేతుడై చండాలరూపధారియై నాలుగు

కుక్కలను వెంటతీసికొని వచ్చుచుండగా యాశంకరాచార్యులు మాయాచండాలవేషధారియైనయాశ్వరుని యీశ్వరుడని యెరుంగక చండాలుడనియే భావించి 'గచ్ఛగచ్ఛ' అనగా తొలగి పొమ్ము తొలగిపొమ్ము అనెను. ఈమాటలు విని చండాలరూపధారియగు యాశ్వరుడు ప్రత్యుత్తర మిట్లుబలికెను.

శ్లో॥ అన్నమయాదన్నమయామథవాచైతన్యమేవచైతన్యాత్
యతివర దూరీకర్తుం వాంఛసి కింబ్రూహి గచ్ఛగచ్ఛేతి.

తా॥ ఓ యతిశ్రేష్ఠుడా! నీ శరీరము అన్నమయమైనదియు నాశరీరము అన్నమయమైనదియు, అందువలన నీశరీరమునకు దూరముగా నాశరీరమును దూరముగా పొమ్మనుటకు వలనుపడదు. అట్లు కాదేని నీచేతనస్వరూపమైన ప్రత్యగాత్మనుండి నాచేతనస్వరూపమైన ప్రత్యగాత్మను దూరముగా దొలిగిపొమ్మనుటకు వీలుపడదు. ఎందువల్ల ననగా "మమాత్మా సర్వభూతాత్మా" అను న్యాయంబున పిపీలికాది బ్రహ్మపర్యంతము సర్వభూతములయందు ఆత్మ ఒక్కటేస్వరూపమున నుండెను. కనుక అన్నమయమైన మనయిరువురి శరీరములు పవిత్రమైనను రెండునుగావలయును, అపవిత్రమైనను రెండునుగావలయునుగాని ఒకటి పవిత్రమును ఒకటి అపవిత్రమును నగుటయు సంభవింపదు. అట్లే నీదేహమందున్న ప్రత్యగాత్మయు పవిత్రమైనయెడల నాదేహమందున్న ప్రత్యగాత్మయు పవిత్రముకావలయును. లేనియెడల రెండును అపవి

త్రిముగావలయును అని నుడువుచు శంకరుడు పలికినవా క్యము అన్యాయమైన వ్యష్టితోఁవ యని నిర్ణయించి మరల యీశ్వరు డిట్లనుచున్నాడు.

శ్లో॥ ప్రత్యగ్వస్తునిని స్తరంగసహజానందావబోధాంబుధౌ వి ప్రోఽయంశ్వపచోఽయమిత్యపిమహాన్కోఽయంవిభేదభ్రమః। కింగంగాంబుని బింబితేం బరమణౌ చండాలవీథీ పయః పూరేవాంతరమస్తి కాంచనఘటీమృత్కుంభ యోర్వాంబరే.

తా॥ అన్వతజడదుఃఖరూపములగు అహంకారాదిక ముకంటె భిన్నమై విలక్షణముగా ప్రకాశించునట్టియు సంకల్ప వికల్పాత్మకములగు అలలు లేకపోవుటచేత నిశ్చలమైపరిపూ ర్ణమై నిత్యానందనిధియగు పరబ్రహ్మమునందు వీడు బ్రాహ్మ ణుడు, వీడు శ్వపచుడు, అనియెడి భేదబుద్ధి భావము యెక్కడ నుండి రాజాలదు. ఇందులకు దృష్టాంతము, గంగోదకములం దును, చండాలు గుండువీధులలో నుండు జలములందును ప్రతి బింబించిన సూర్యునకును, బంగారుకుండయందున్న ఆకాశము నకును మట్టికుండయందున్న ఆకాశమునకును భేద మెట్లు లేదో అట్లే ఆత్మకు గుణదోషభేదము లేదు. అందున-

శ్రు:—ఏకఏవహి భూతాత్మా భూతేభూతే వ్యవస్థితః
ఏకధా బాహుధాచైవ దృశ్యతే జలచంద్రవత్.

తా॥ సర్వభూతములకు పరమాత్మ తా నొక్కడైనను ప్రతిభూతమునందును అనేకచోట్లనున్న జలంబులందంతటను

తానొక్కడే చంద్రుడు ప్రతిఫలించునట్లుగా పరమాత్మ తా నొక్కడయ్యును అన్నిభూతములలో అదే విధముగా ప్రతి ఫలించియున్నాడు. ఎట్లనిన-

శ్లో॥ ఘటసంవృత మాకాశం నీయమానే ఘటోయథా
ఘటోనీయేత నాకాశం తద్వజ్జీవో నచోపమః
ఆకాశవత్సర్వగతశ్చ నిత్యతః.

తా॥ అనగా సర్వఘటములలో నిండియున్న ఆకాశము నకు నెట్లు భేదము లేదో అట్లే సర్వశరీరము లనే భూతకోటి యందున్న పరమాత్మకు భేదము లేదు. ఇట్టి విషయమున-

శ్లో॥ దండమండితకరాఘృతకుండాపాటలాభవనసాః పటవాచః
జ్ఞానగంధరహితాగృహసంస్థాః వంచయంతికిం కేచన వేషైః.

తా॥ కొందరు కాషాయవస్త్రధారులై దండకమండల ములు చేత ధరించి స్వల్పమైనను జ్ఞానమేమియు నెరుంగక యే తాము ధరించిన వేషముచేతనే గృహస్థులను భ్రమపెట్టి మోసము చేయుచున్నారు. గనుక-

శ్లో॥ బ్రాహ్మణశ్వపచభేదవిచారః ప్రత్యగాత్మనికథంతవ
యుక్తఃబింబితేఽంబరమణౌసురనద్యామంతరం
కిమపి చాస్తి సురాయామ్.

తా॥ విద్వద్వర్యుడవైన నీవంటివాడు వీడు శ్వపచుడు, వీడు బ్రాహ్మణుడు అను భేదమును ప్రత్యగాత్మయందు కనం బరచుట తగునా? గంగోదకములందును కల్లునందును ప్రతి

బింబించిన సూర్యునకు భేదముగలదా? అని చండాలరూప ధారియైన యీశ్వరుడు ఊరకొనియె.

అంత ఆదిశంకరాచార్యులవారు చండాలరూపధారియైన పరమశివుని వాక్యము విన్నవారై తాను స్వయముగా సకలశాస్త్రముల నభ్యసించి శాశ్వతమును నిరతిశయమును అగు బ్రహ్మానందానుభవముచేత శాంతశమదమాది స్వానుభూతి చిత్తస్థైర్యమును బొందియున్నారుగనుక తనయొక్క ధర్మసమష్టి తత్త్వానుభవము సర్వలోకులకు వెల్లడిగాగలందులకును ముముక్షువులకు స్వాభిమానము వదలి బ్రహ్మాఖ్యానుభవము సానుభూతిని లభించి, సర్వసమష్టిపొందగలందులకును యీశ్వరునియెదుట సత్యముజేసి, అయిదు శ్లోకములతో తన స్వానుభవ సత్యసమష్టివాక్యములు పలుకుచున్నారు.

ఇట్లు శ్రీ శంకరుని ప్రత్యుత్తరము.

శ్లో॥ సత్యమేవ భవతా యదిదానీం ప్రత్యవాది తనుభృత్ప్రవరైతత్ । అంత్యజోఽయ మితి సంప్రతిబుద్ధిం సంత్యజామి వచసాఽఽత్మవిదస్తే.

తా॥ దేహధారులలో ఉత్తముడవగు ఓమహాత్మా, యిప్పుడు నీవు జెప్పినదంతయు యథార్థమే యిందు సందేహము లేదు. ఆత్మవేత్తవగు నీమాటచేత నేను వీడు చండాలుడు

అపవిత్రుఁడు నేను పవిత్రుఁడను ద్విజుఁడను అని భేదబుద్ధిని నే నిపుడు వదలుకొనుచున్నాఁడను.

శ్లో॥ జ్ఞానతేశ్రుతిశిరాంస్యపి సర్వే మన్వతేచ విజితేంద్రియ వర్గాః యుంజతే హృదయ మాత్మని నిత్యం కుర్వతే నధిషణా మపభేదామ్."

తా॥ అందరు ఉపనిషత్తుల నెరుగుదురు. అటుల నెరింగి ఇంద్రియముల జయించి ఆఉపనిషద్వాక్యముల మననము సేయుచు తమ హృదయము నీయాత్మయందు చేర్చి ధ్యానముసేయుచునే యుందురు. అయినను ప్రతిబంధకాతిశయమువలన భేదశూన్యబుద్ధిని బొందుటలేదు. కనుక మహాత్మా యిదియే నాస్వానుభూతి జెప్పుచున్నాను.

శ్లో॥జాగ్రత్స్వప్నసుషుప్తిషు స్ఫుటతరంయా సంవిదుజ్జృంభతే యాబ్రహ్మాదిపిపీలికాంతతనుషుప్రోతాజగత్సాక్షిణీ సైవాహంచనదృశ్య వస్త్వితి దృఢప్రజ్ఞాపియస్యాస్తిచే చ్చండాలోఽస్తునతుద్విజోఽస్తుగురురిత్యేషామనీషామమ.

తా॥ ఏ ఆత్మచైతన్యమును జాగ్రత్స్వప్నసుషుప్తులను మూఁడవస్థలయందు స్పష్టముగా ప్రకాశించుచున్నదై బ్రహ్మ మొదలుకొని పిపీలికాదివరకుగల శరీరములందున్నదై జగత్తు సాక్షిగా చూచుచున్నదో అట్టి జ్ఞానస్వరూపమే నేనుగాని కంటికి గోచరించునట్టి ప్రపంచము నేనుగా నను దృఢమైన

జ్ఞాన మెవ్వనికి గలదో, వాఁడు చండాలుఁడైనను బ్రాహ్మణుఁడైనను నాకు గురువగును అని నా అభిప్రాయము.

శ్లో॥ "బ్రహ్మైవాహ మిదంజగచ్చ సకలం చిన్మాత్రవిస్తారితం
సర్వంచైతదవిద్యయా త్రిగుణయా సేశం మయాకల్పితమ్
ఇత్థంయస్యదృఢామతిస్సుఖతరేనిత్యే పరేనిర్మలే
చండాలోఽస్తునతుద్విజోఽస్తుగురురిత్యేషామనీషామమ."

తా॥ చైతన్యముతో నిండియున్నట్టియు జీవేశ్వరాది భేదముగల యీ ప్రపంచమంతయు సత్వరజస్తమోగుణాత్మకమగు అవిద్యచేత నావలన కల్పింపఁబడినది. నేను నిర్మలమైన పరబ్రహ్మమును అని ఈవిధముగా సుఖరూపమైనట్టియు నాశనములేనట్టియు స్వచ్ఛమైనట్టియు పరబ్రహ్మమునందు యెవనికి దృఢమైనబుద్ధి కలదో అట్టివాఁడు చండాలుఁడైనను బ్రాహ్మణుఁడైనను నాకుగురువగునని నాయభిప్రాయము. అని యీవిధముగా శ్రీమచ్ఛంకరాచార్యులవారు గురుపీఠాధికారసర్వజనసమష్టినిగురించి అయిదుశ్లోకములతో స్పష్టీకరించెను. మిగిలిన మూఁడుశ్లోకములను గ్రంథవిస్తరముచే యింతట వ్రాయక విరమించుచున్నాఁడను. అవతారికమాత్రమును వినుఁడు.

శ్రీమదాచార్యులవారు యిట్లు వచించుటకు గారణ మేమనగా ఇట్లు దృష్టాంతప్రమాణవాక్యములను యిచ్చిరి ఎట్లనగా-

మనకు సృష్ట్యాదినుండిగల జన్మములందు సదా పుణ్యా పాపకర్మములను మననము సేయుచుండుటచేత సమయోచితా నుసారముగ మన కభీష్టమైన వస్తువులయందు కోరికయును వాటికి వ్యతిరిక్తములయందు క్రోధమును ఒకరి ఉపదేశము లేకయే ఎట్లు గలుగుచుండునో అట్లె అనేక జన్మములనుండి నిష్కామసత్కర్మ అప్పుడప్పుడు చేసియుండుటచే నొకానొకస మయంబున వేదాధ్యయనాదిశాస్త్రపరిజ్ఞానము లేకపోయిన ప్పటికిని పూర్వపుణ్యవిశేషణమువలన బ్రహ్మాతత్వానుభవ ము వాడికి నిష్కారణముగా తనంతట తానే దైవికప్రాప్తులచే వైరాగ్యోపరతులు రెడ్డికులస్థుడైన వేమన్నకు లభించినట్లును దూదేకుల కులస్థుడైన సిద్దప్పకు లభించినట్లును మాదిగవా డైన మతంగునకు లభించినట్లును ప్రతియొకనికిగలుగుచుండును గనుక అట్టివానికి గురుతత్వబోధాధికారము గలుగగూడదను శంక తీసివేయగలందులకు శ్రీమదాచార్యులవారు జెప్పియు న్నారు, గనుక సుజనులారా!

శ్లో॥ యథాస్వప్నప్రపంచోఽయం మయిమాయావిజృంభితః
ఏవం జాగ్రత్ప్రపంచోఽపి మయిమాయావిజృంభితః.

తా॥ అనగా నిద్రావస్థలో నున్నవానికి స్వప్నావస్థ రతికార్యములన్నియు యెట్లు ప్రత్యక్షానుభవముగ దోచుచుం డునో అట్లే అజ్ఞాననిద్రలోనున్న వానికి యీమాయాప్రపంచ మంతయు నిజమైన ప్రత్యక్షముగా భ్రాంతివిజృభించి పైనెక్కి

వాదభేదలోలుని చేయుచుండును. అట్లే నిద్రమేల్కాంచిన వానికి స్వప్నకార్యావస్థలన్నియు స్వరూపములేకయే నశించిపోయినట్లు జ్ఞానజాగ్రితబొందిన మానవునకు ఈమాయా ప్రపంచస్వరూప మంతయు నశించి ఆత్మమాత్రమె స్వానుభూతికి గోచరించుచుండును. కనుక సర్వసుజనులారా! నేను శాస్త్రజ్ఞుడననియు యజ్ఞవేత్తననియు మంత్రానుష్ఠానపరుడననియు దానధర్మపరుడననియు సత్రములు చలివేంద్రలు బెట్టితిననియు నాది అగ్రజన్మమనియు నేను జ్ఞానిననియు నేను భక్తుడననియు నాకు దెలిసినభావన మరియొకనికి దెలియదనియు నాతోశ్రవదప్ప అన్యులతోశ్రవ మంచిదిగాదనియు యెంతవరకు మానావమానవునకు వ్యష్టిభావన వదలలేదో అంతవరకు అతడు స్వప్నసుషుప్తి అజ్ఞానసముద్రమున మునిగి అల్లాడుచున్నాడని తలపోయుడు. "జ్ఞానాగ్నిదగ్ధకర్మాణాం తమాహుఃపండితంబుధాః." అనగా, జ్ఞానమనే అగ్నిచేత యెవని కర్మ దహనము చేయబడి యుండెనో అట్టివానిని మాత్రమె పండితుడనియు బుధుడనియు అనగా గురుస్వరూపుడనియు తలపోయవలయును గాని

శ్లో॥ దుర్జనః పరిహర్తవ్యో విద్యయాలంకృతోపిసన్
మణినాభూషిత స్సర్పః కిమసౌనభయంకరః

—భర్తృహరి.

తా॥ అనగా సమస్తవిద్యలచేత అలంకరింపబడినవాడైనను దుర్గుణములు వానికి ఉన్నట్లైన వాడు గౌరవించక విసర్జించదగినవాడు. ఎట్లనగా నాగసర్పము ఫణములపై కోట్లఖరీదుగలిగిన మణు లున్నప్పటికిన్ని వానిదుర్గుణము ననుసరించి ఆనాగసర్పముదగ్గరకు బోవుటకు ఎట్లు వెఱతుమో, అట్లె ఎంత విద్వాంసుడైనను ఏజాతివాడైనను సద్గుణములు లేని వాడు పరిత్యజించదగినవాడు. అట్లుగాక.

శ్లో॥ ఏతేషాం దేశికానాంచ లక్షణం శృణు సువ్రత
అహింసాసత్యశౌచాది విశ్వజీవదయాపరః
నిర్మలోనిరహంకారో నిశ్శంకో నిర్వికల్పకః
తమోవిహీనః శాస్త్రజ్ఞః పరమార్థ విచింతకః
ఏవం లక్షణసంయుక్తో హ్యాచార్యవర ఉచ్యతే
శ్లో॥ గురవో నిర్మలశ్శాంతాః సాధవో మితభాషిణః
కామక్రోధ వినిర్ముక్తాః సదాచార జితేంద్రియాః
చాతుర్యవాక్ వివేకీచ అధ్యాత్మజ్ఞానవాన్ శుచిః
మానసంనిర్మలంయస్య గురుత్వం తస్యశోభతే.

తా॥ ఓపార్వతీ! గురువుకుండవలసి నటువంటి లక్షణములు వినవలసినది. జీవహింస చేయనివాడును, సత్యమును వచించి వర్తించువాడును బాహ్యాంతరశుచిగలవాడును, సర్వభూతదయగలవాడును, శాంతశమదమాదులు గలవాడును, అహంకారము లేనివాడును సందేహము లేనివాడును, ఆశ లేని

వాడును, తమోగుణములేని వాడును, శాస్త్రధర్మములు చెలిసినవాడును, సదాపరోపకారార్థ కార్యముల కొరకు ప్రయత్నము చేయువాడును యీలక్షణములుగల వానిని శ్రేష్ఠమైనగురువని చెప్పవలయును. మరియు నిర్మలమనస్సుగల వాడును శాంతచిత్తుడును సాధనచతుష్టయము సానుభూతి గలవాడును మితభాషణము గలవాడును అనగా మితముగా మాట్లాడువాడును కామక్రోధాదులు లేనివాడును నిత్యకృత్యము అనగా తనగురుసాంప్రదాయకమును విడువక నటించువాడును పంచేంద్రియ నిగ్రహముగల వాడును దేశ కాల పాత్రములను దెలిసికొని బోధించదగు జాగ్రతగల వాడును తత్త్వానుభవస్వానుభూతిగలవాడును తత్త్వశుద్ధిబొందినవాడునుసదా హెచ్చుతగ్గుల చర్యలు లేక ఒకేభావన వర్తనగలవాడును అగు ఏమానవుడు కలడో అతడే సర్వలోకమునకు సర్వధర్మములు బోధించదగిన గురుస్థానమునకు ప్రకాశముగలపురుషుడుగాని, వేరే శాస్త్రము చదివినంత మాత్రముననే ద్విజకులమున బుట్టినంతమాత్రముననే గురుస్థానాధిపత్యమునకు తగరు తగరని సర్వశాస్త్రసమ్మతము గనుక సద్గుణగరిష్ఠుడైన ఏమానవుని దగ్గర మంచివిద్యకలదో అట్టివాని దగ్గరనున్న విద్యను గ్రహించక కులాభిమానము ననుసరించి వదలుకొనుచున్నారో వారలు యిహపరములయందు వ్యర్థులగుదురు. ఇది సత్యము సత్యము. అయితే శ్రీకృష్ణపరమాత్మ

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.
—భగవద్గీత అ 3. శ్లో 35.

తా॥ బాగుగా నాచరించబడిన పరధర్మము కంటెను, గుణహీనముగా ననుష్ఠించబడినను తన ధర్మము మిక్కిలి మంచిది. ఏమనగా తన ధర్మము దప్పకుండగ నడచుచు జచ్చుటయైనను మేలు. పరధర్మము నరకాదిరూపమగు భయమును గలుగజేయును. అని (యెవరిధర్మము వారలు నటించుట మంచిది యని) చెప్పియుండెనే, యీ గ్రంథమునం దంతయు మానవుల కందరికి గుణాధికారము ననుసరించి వ్యష్టిసమష్టి జ్ఞానాజ్ఞాన రెండు భాగములుగానే కర్మాచరణాధికారము మానవులకు నిర్ణయించబడి యున్నది. ఈపైన జెప్పిన శ్రీకృష్ణుని వాక్యమునకు సమాధానమేమని ప్రశ్న చేయుదు వేని దీనికి సమాధానము విజ్ఞులైన పండితులందరును తెలిసి కొనియే యున్నారు. అయినను నందరికిని తెలియగలందులకు నే నిచట వివరించుచున్నాడను. శ్రీకృష్ణపరమాత్మ "శ్రేయాన్ స్వధర్మో విగుణః" అని నుడివినవాక్యము జాతివిభాగమైన కర్మలను గురించికాదు చెప్పినది. ప్రతియొక మానవుడీలోకమునబుట్టి భగవంతుని యజ్ఞమునకు సహాయముచేసి తీర్చుకొనవలసిన త్రిగుణములను గురించి ఓయి యర్జునా నేను యీలోకులకు యజ్ఞార్థమై పంపించిన కార్యము నెరవేర్చుకొని

ఆవల ప్రతియొకడు మోక్షము నపేక్షించుట శ్రేయస్సని నుడివెను. ఎట్లనగా-

శ్లో॥ లోకేఽస్మిన్ ద్వివిధానిష్ఠా ... —భగ. అ 3. శ్లో 3.

తా॥ అర్జునా! నేనిదివరలో కర్మనిష్ఠయనియు జ్ఞాననిష్ఠయనియు, రెండు తెరంగుల మానవునకు నిష్ఠజెప్పితిని. అందు సాంఖ్యులు ఆత్మానాత్మవివేకముగలిగి గృహస్థాశ్రమమున జేరకయే బ్రహ్మచర్యమునుండియే సన్యసించిన జ్ఞానులు. అట్టివారు జ్ఞానయోగముచేతనే తరింతురు.

ఇక కర్మయోగులు గర్మయోగముచేతనే తరింతురు. అయితే అందరును బ్రహ్మచర్యమునుండియే సన్యసించి తరించజాలరు ఎందువల్లననగా.

శ్లో॥ నహికశ్చిత్ క్షణమపి ...

—భగ. 3 అ. శ్లో 5.

తా॥ ప్రతియొక మనుష్యుడును ఒక క్షణకాలమైనను కర్మములను జేయకుండ నుండజాలడు. ప్రతియొక ప్రాణియు ప్రకృతివలన బుట్టిన సత్వరజస్తమోగుణములచేత నావరింపబడి బలత్కారముగా ఇంద్రియములు స్వాధీనము లేనివాడై ప్రతిక్షణమునను కర్మసంకల్పుడగుచునే యుండును. అందువలన.

శ్లో॥కర్మేంద్రియాణిసంయమ్య...... —భగ.అ 3. శ్లో 6.

తా॥ ఎవ్వడు సర్వేంద్రియములు ఏ యే కార్యములకు శాస్త్రవిహితమైన కర్మములకు అనగా, స్వభార్యయందే తన

ఇంద్రియము నుంచుట సత్యవచనమునందును యుక్తాహారము భుజించుటయందును వాక్కును వినియోగించుట ఇట్లే, ప్రతి యొక ఇంద్రియము చేయవలసినటువంటి స్వధర్మమును నిర సించి సన్యసించినందువలన పైన జెప్పినట్లు ప్రకృతి బలా త్కారముచేత మనస్సు విషయవాసనలందు దగులుచుండును గనుక అట్టివాని జ్ఞానము మిథ్యాచారమై డాంబికవృత్తియై వృథాగా జెడిపోవును. గావున మానవుడు-

శ్లో॥ నియతం కురు కర్మత్వం ...... —భగ. అ 3. శ్లో 8.

తా॥ నీవు నిత్యములగు కర్మములను జేయుము. కర్మ ములు జేయక సన్యసించుటకంటెను కర్మములు జేయుచుం డుటయే మంచిది. అట్లు కర్మలను జేయకుండుటచేత (భగవదా జ్ఞానుసారము తా నీలోకమునకువచ్చి చేయవలసినవిధి నతిక్ర మించుట ఒకటి, ఆయాఇంద్రియములు మనసుచే చలించుట చేత మోక్షమార్గమునకు ఆటంకము గలుగుట రెండు. ఈలో కమునందు తనశరీరమునకు ఆరోగ్యసౌఖ్యములు లేకపోవుట మూడు. ఇట్లు కర్మ లాచరించనందువలన కలిగెడు ప్రతిబంధ కములై యున్నవి). కనుక కర్మలు జేయనందువలన నీకు శరీరయాత్రను సిద్ధిగలుగ దని యెరుంగుము. అయితే కర్మలన రెండువిధములై యున్నవి. ఎట్లన?

శ్లో॥ యజ్ఞార్థా త్కర్మణో ఽన్యత్ర ... —భగ. అ 3. శ్లో 9.

తా॥ అర్జునా! భగవంతునిగూర్చి చేయుకర్మలకంటెను యితరకర్మలు జేయువారికి బంధముగలుగును. కావున ఫల ముకోరనివాడవై యజ్ఞార్థమగు కర్మమును తప్పకసేయుము.

శ్లో॥ సహాయజ్ఞాః ప్రజాస్సృష్ట్వా... —భగ. అ3. శ్లో 10.

తా॥ సృష్టికర్త మొట్టమొదట యజ్ఞములతోగూడ ప్రజలను సృజియించి మీరు యీయజ్ఞముచేతను ఉత్పత్తిజే యుడు. ఈయజ్ఞము మీకుకోరిన కోరికలనిచ్చును అనెను.

శ్లో॥ దేవాన్భావయతానేన ... —భగ. అ 3. శ్లో 11.

తా॥ ఈ యజ్ఞములచేత ఇంద్రాది దేవతలను వృద్ధి బొందింపుడు. ఆ దేవతలు మిమ్ములను వృద్ధిబొందింతురు. ఇట్లు ఒకరికొకరు వృద్ధిబొందించుకొనుచు క్షేమమును బొందుదురు

శ్లో॥ యజ్ఞశిష్టాశినస్సంతో ... ... భగ. అ 3. శ్లో 13

తా॥ ఎవరు యజ్ఞశేషమును భుజింతురో వారిపాపము లన్నియు దొలగును. దేవతలకు గాకుండ దమకొరకే ఎవర అన్నమువండి భుజించుచున్నారో అట్టి పాపులు అధిక పాప మును బొందుదురు.

అని శ్రీకృష్ణపరమాత్మ నుడివినది. ఋగ్వేదస్మృతి ప్రకారము విరాట్పురుషునియందు యింద్రాది దేవతల జనించి తాము ప్రవేశించి సౌఖ్యము బొందుటకు ఒకచేత స్వరూపము జూపించుమనగా ముందు గోవును అశ్వమును శ్రీ భగవంతుడు ఆ దేవతలకు చూపించగా దేవతలు ఇ

మాకు తృప్తింజేయం జాల వనిరి. అప్పుడు మరల మనుష్యుని చూపించగా దేవతలు సంతసించి ఇతడు మాకు సరిపోవునని ఆ దేవతలందరు ఈమానవదేహమునందు ప్రవేశించిరి. అప్పుడు (శ్రీ) భగవంతుడు యీ మనుష్యుడు యిచ్చు చరు పురోడాశనాది ఆహుతులు మీకు విభాగముల ప్రకారము వచ్చు నని దేవతలకు నియమించెను. అందువలన భగవదాజ్ఞ ప్రకారము వేదమునందు 'పంచయజ్ఞవిధానంతు గృహీ నిత్యం నహాపయేత్" అని అనగా ప్రతియొక గృహస్థుడును "బ్రహ్మయజ్ఞో దేవయజ్ఞః పితృయజ్ఞ స్తథైవచ భూతయజ్ఞోఽన్యయజ్ఞశ్చ పంచయజ్ఞా ప్రకీర్తితాః" అనగా బ్రహ్మయజ్ఞము దేవయజ్ఞ పితృయజ్ఞము భూతయజ్ఞము మనుష్యయజ్ఞము లనునవి ప్రతిమనుష్యుడును ప్రతిరోజును ప్రాతఃకాలమున ఆచరించి దేవతారాధన నివేదనచేసికొని అన్నమును భుజించ వలయును. అట్లు జేయని మానవుడు పాపమును బొందును. అని సర్వజన విశదముగా వేదవిధి యున్నదిగనుక ఈయజ్ఞము లాచరించుటకు ద్రవ్యము కావలసియున్నది. కనుక 'ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య" అనగా జీవహింస లేనటువంటిన్ని యొరులను పీడించనటువంటిన్ని పెద్దలు సంతసించునటువంటిన్ని కృషిజేయుచు ద్రవ్య మార్జించవలయును. అందు ఈ యజ్ఞమునకు పక్వాన్నపదార్థములు సేయుటకు సహాయకారి యగుటకున్నూ "ప్రజాతంతుం మావ్యవ త్సేత్సి"

అనగా భగవంతుని యజ్ఞములో ఈ మనుష్యుని వంశ మనే తీగ తెగకుండుటకై సంతానము గనుట కొరకును మానవుడు సద్గుణవతియగు ఒక స్త్రీని పాణిగ్రహణము పొంది ఆమెతో శాస్త్రానుసారముగా ధర్మసంతానము పడయవలయును. అనంతరము తన కుమారుడుగాని దత్తకుమారుడుగాని వ్యక్తికి వచ్చినపుడు ఈ మాతాపితరులు ఇదివరలో ఆచరించి నటువంటి పంచయజ్ఞవిధానము మొదలగు కర్మ చట్టమును ఈ కుమారునకు అప్పగించినపుడు ఇతనికి పితృఋణము దేవఋణము తీరిపోవుచున్నది. ఈ రెండు ఋణాములు తీర్చవలసిన భారము మానవుడు యీ లోకమునకు వచ్చి నందుకు స్వకృషిమై యున్నది. కనుక శ్రీకృష్ణ పరమాత్మ, ఓయి అర్జునా! "శ్రేయాన్ స్వధర్మో విగుణః" అనగా మాయాస్వరూపమై నటువంటిన్ని కల్పనాకథ భ్రాంతి జన్యమైనటువంటిదిన్ని సంసారమందు ప్రవేశించుట సారము లేనిదైనప్పటికిన్ని దానిని భగవదాజ్ఞానుసారము నెరవేర్చి ఆవల మోక్షము నపేక్షించుటే మానవునకు శ్రేయస్సని నుడివెను గాని.

పంచములు వ్యవసాయము చేయకూడదనియును, శూద్రులు చదువుకొనిన బాగుపడరనియును, బ్రాహ్మణులు వ్యవసాయముచేసిన చెడిపోవుదురనియును నుడివిన ముక్క గాదు. "శ్రేయాన్ స్వధర్మోవిగుణః."

అట్లయిన మొన్న మొన్నటివరకు ఆర్యులు వ్యవసాయముజేసి వేటాడి అనేకవిషయములుగా జీవించినట్టు శాస్త్రములు జెప్పుచుండె. అసలుసృష్టిలో జాతులేలేక సర్వులును బ్రహ్మజాతిగానే నుండె. ఇట్టి విషయమున జాతివిభాగకర్మములయందు ఎట్లు శాస్త్రజ్ఞులు జెప్పుచుండిరో విజ్ఞులు నెరుంగునది. అయితే శూద్రుడు తపస్సుచేసినందువలన ద్విజునికుమారుడు చనిపోయినట్లును అందువలన రాముడా శూద్రునిచంపినట్లును రామాయణము చెప్పునదే ఈ ప్రశ్నకు సమాధానమేమనిన వినుడు.

శ్రీరాముడు మాయామానుష అవతారము. శ్రీకృష్ణుడు లీలామానుష అవతారము. అందు శ్రీరాముడు ఐదుభాగముల కార్యములు యొరుల ప్రేరేపణతో జేసెను. శ్రీకృష్ణుడు సర్వకార్యములు స్వతంత్రముగా నెరవేర్చెను. ఇందుకు ఒక దృష్టాంతమును వినుడు.

శ్రీరాముడు రావణుని జయించిన యనంతరము సీతయొక్క ప్రతివ్రతాధర్మముదెలియుటకు అగ్నిని ప్రవేశింపజేయించునపుడు సీత పతివ్రతయే యని ఆకాశవాణి అగ్నిహోత్రుడు మొదలగువారు సాక్ష్య మిచ్చిరి. అప్పుడు రాముడు సంతసించి యిష్టపడి సీతను గైకొని అయోధ్యకువచ్చి పట్టాభిషిక్తుడాయెను. అంత కొన్ని నాళ్ళకు చాకలివాడేమో అనెనని అపకీర్తికి వెరచి సీతను శ్రీరాముడు ఆరణ్యవాసము పంపెను.

అయితే అంతకుపూర్వము రామునకు అపకీర్తిసంగతి తెలియక సీతను స్వీకరించి చాకలివాని ఉపదేశమువలన రామునకు తెలియవచ్చెనాయేమి? ఇదియో మాయామానుషలీలాకారణము. అదియటులుండ పతివ్రతయగు భార్యను దుఃఖింపజేయువానికి దారిద్ర్యము సంభవించునని శాస్త్రములు సెప్పుచుండ రాముడిప్పుడు పతివ్రతయగు భార్యను దుఃఖింపజేసినందులకు ఇప్పుడేమిసమాధానము? ఇది యంతయు ముందేదియో యొక కారణమున్నదనియును దానివలన నిట్లు జరిగెననికదా సమాధానముమీరుజెప్పునది. లేక కారణమేమియును లేదు అని చెప్పినను జెప్పుము. శ్రీరాముడే చెడ్డవాడగును. ఇదియిటులుండ శౌర్యధైర్య సాహసబలపరాక్రమ తేజోవంతులై నటువంటి సూర్యవంశపురాజులు చెట్టుచాటునుండి ఒకనిని మరియొకని ప్రోత్సాహముచేత చ పవచ్చునా దీనికి నొక కారణమున్నదనియె నీవు చెప్పబోవునది. ఇట్లే రెండు కార్యములకును నొక కారణము నెట్లు చూపించబోవుచున్నావో అట్లె శ్రీరాముడు తపస్సుచేయు శంబుకుని సంహరించినందులకు నొక కారణముకలదని తెలిసికొనుడు. ఎట్లనిన ఆశంబుకుడు యీశరీరయాత్ర జీవించియుండగానే శ్రీరాముని లో తానైక్యము కావలయునని తపస్సు చేయుచుండెను. అట్టి విషయమును నారదుడు గ్రహించి యీ శంబుకునికార్యము నెరవేర్చగలందులకు శూద్రుడు తపస్సు చేయుచున్నాడని

యును అందువలన ద్విజుని కుమారుడు చనిపోయినట్లు నార దుడు సూచించుటయు ఆవంక బెట్టి రాముడు శంభుని వధించి తనలో నైక్యముజేసికొనెను. ఈ విషయమును దెలియగోరు వారు శ్రీమద్రామాయణము జదువుకొనుడు. ఇంతియే కాక అట్టి కాలమున తండ్రియుండగా కుమారుడు మృతి బొందగూడదను శాస్త్రచట్టమే నిజమైనయెడల ఏరూపముతో నైనను తండ్రియుండగా కుమారుడు మృతిబొందకుండా యుండుటయెగదా ప్రధానము? అట్లయిన బ్రహ్మర్షియైన వశిష్ఠుడుండగా ఆయన కుమారులు నూర్గురు మృతిబొందిరి. కనుక సర్వసుజనులారా! శ్రీరామచంద్రుని మనసు వ్యష్టియా సమష్టియా యని తెలియగోరువారు శ్రీరామ లక్ష్మణసంవాదరూపంబైన రామగీతను తెప్పించి చదువు కొనుడు. మీరు వృథాగా శ్రీరామునియందు శంబుకుని చంపె నని పక్షపాతము మోపి పాపమును పొందెదరు. ఇట్లు శ్రీరాముని దూరినందులకుగాను ఛాంద్రాయణము చరించి యైన రామకోటి వ్రాసియైనను ఆపాపము పోగొట్టుకొనవలసి యుంటుంది, మేలుకొనుడు, అని శాస్త్రములు చెప్పుచున్నవి గాన తెలిసికొనుడు.

"అజ్ఞస్సుఖమారాధ్య" అను న్యాయంబున వ్యష్టి భావనగలవారలు యథార్థము నెరుంగనేరేరు. వారికి ఎన్ని జన్మములకును భగవత్ప్రాప్తిని బొందుటకు సమష్టి ధర్మము

లభించనే లభించదు. ఎట్లనిన వాంతిగలవానికి గారెలుబెట్టిన నేమి బూరెలుబెట్టిననేమి వానికేమి రుచించును? అట్లే ప్రకృతి వ్యష్టిభావనగల శాస్త్రములను మాత్రము అనుభవించి అందువిషయ వాసనాలోలత్వమనె అజీర్తివలన వాదభేదముల నే వాంతితో పుక్కిటింతలై యున్న ప్రజలకుచీకటిలో వెన్నెల లభించునా? అట్లే, వ్యష్టిలో సమష్టి లభించునా? అని సందేహముండరాదు, దైవికముగా లభించును. లభించును. ఎట్లనగా "సత్కర్మపరిపాకతో బహూనాం జన్మనామంతె మోక్షేశ్చజాయతె." అను న్యాయంబున వారివారి పూర్వకృతము ననుసరించి యొకానొక కాలమందు జారుడైన వేమన్నకు బ్రహ్మతత్పరత్వము లభించినట్లు ఒక్కొక్కరికి శాస్త్రసాంగత్యమువలననో సజ్జనసాంగత్యమువలననో వ్యష్టిగలవారికి సమష్టితత్వము లభించి శ్రీమన్నారాయణుని కృపాకటాక్షములకు పాత్రులరై, యిహపరసౌఖ్యంబు లనుభవింతురు గనుక నా ఆత్మహితులారా! నాసోదరీ సోదరులారా! ఎన్నిజన్మములకైనను సర్వభూతదయతో సర్వజనసమష్టిభావనబొంది నివృత్తిమార్గమున దైవభక్తి గురుభక్తి గలిగి మానపురాణ, కర్మభ్రాంతి వదలి, శరీరదృష్టి వదలి ఆత్మరతితో వర్తించు ప్రాప్తము లభించినప్పటికే మానవునకు మోక్షసిద్ధి గలుగును. అంతపర్యంతము అగ్రజన్మమందు బుట్టినను అర్థములన్నియు దెలిసికొనినను, అష్టాం

యోగము లభ్యసించినను, నిత్యసమారాధన లొనరించినను మోక్షప్రాప్తి లేదులేదు. కనుక సర్వజనులు సత్యసమష్టిని తెలిసికొని వర్తించుచూ లోకుల కట్లె బోధించుచూ యిహ పరసౌఖ్యంబు లనుభవింతురుగాక.

సర్వేజనాః సుఖినోభవంతు
సమస్తసన్మంగళాని భవంతు

ఇది శ్రీమన్నారాయణవరప్రసాదలబ్ధ కవితావిలాస పోకా వెంకటకృష్ణదాస ప్రణీతంబైన జాతీయసమష్టి ధర్మతత్వరహస్యమునందుగల పంచమాశ్వాసం బను సర్వజనసమష్టిధర్మాచరణవిధివిచారణ సర్వము సమాప్తము

---